## 5

విభవ వసంతం

SPRING 1988



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHIATANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
April 1988, pp. xii + 82.

అట్ట ముందు అజంతా
అట్ట వెనక దాశరథి

వెల : రూ. 10-00 (వార్షిక సభ్యత్వం రూ. 15-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

**Dr. T. V. Subba Rao**
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
I.K.S., University of Mysore,
Manasagangotri, Mysore-570 006

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్. విద్యారణ్యపురం, మైసూరు-8.

# ప్ర'ముఖ' కవి అజంతా

అందరికీ అర్థం కాని ప్ర'ముఖచిత్ర' కవి అజంతా. అర్థమైన వారికి అత్యంతాప్తుడు అజంతా. అసలు పేరు పెనుమర్తి విశ్వనాథ శర్మ. తలి దండ్రులు కామేశ్వరి, శ్రీరామమూర్తి. నరసాపురం టైలర్ హైస్కూల్లో, విజయనగరం మహారాజా కాలేజీలో చదివి, తర్వాత వాల్తేరులో బి కాం. చదివి పరీక్షకు వెళ్ళలేదు. 'ఆనంద వాణి', 'జయభారత్', 'తెలుగు దేశం', 'ఆంధ్ర జనత' మొదలైన పత్రికల్లో పనిచేసి చివరకు 1960లో 'ఆంధ్రప్రభ'లో స్థిర పడ్డారు.

అజంతా రాసింది చాలా తక్కువ. తక్కువ రాయడం మాత్రమే అజంతాలో విశేషం కాదు. రాయడమొక సుదీర్ఘ తపస్సుగా భావించడమే ఆయనలో విశేషం, మొదటి కవిత 'భయపడిన వాడు' నుంచి ఈ నాటివరకు రాసినవన్నీ పోగు చేస్తే ఒక్క కవితా సంపుటి అవుతుందేమో. అయినా ఆ సంపుటి ప్రచురించడానికి కూడా అంగీకరించని విచిత్ర మనస్తత్వం అజంతాది. 'సూర్యుని ఆత్మహత్య', 'పరిత్యాగి పరివేదన', 'గాలీ వెల్తురు లేని గది', 'కుశల ప్రశ్న'. 'కొత్త సంవత్సరం' తొలినాటి కవితల్లో కొన్ని. కొన్ని రోజులు 'ఆంధ్రజనత'లో, 'ఆంధ్ర ప్రభ'లో 'కిటికీలో సూర్యుడు' అనే ఫీచర్ నడిపారు.

అజంతా రాసిన కవితా చిత్రం ఒకసారి మనసులో ప్రవేశిస్తే మళ్ళీ అంత రించేది కాదు ఆయన సృష్టించిన 'చెట్లు కూలుతున్న దృశ్యం', సుషుప్తి', 'రోజూ చూస్తూనేవున్నాను', 'కంప్యూటర్ చిత్రాలు', 'వక్రరేఖ' 'చీకటి చిత్ర శాల', 'అనామిక' మొదలైనవి అజంతా అరాచకతకు. అస్తిత్వానికి, ప్రతీకలకు ప్రతినిధులుగా ఉన్నాయి. "నేను కలల అంచులపై నడిచే సర్రియలిస్టును కాను. రోడ్లపై నడిచే సర్రియలిస్టుని. వాస్తవాన్ని వాస్తవంగా చూడడం వాస్తవం కాదు. వాస్తవం ముసుగు తీయడమే నిజమైన వాస్తవం" అంటారు అజంతా. రాజకీయ దుర్గంధం ఏ మాత్రం సోకకుండా ఎక్కడో చీకట్లో అజ్ఞాతంగా కూర్చుని అప్పుడప్పుడు కవిత్వం రాసే వాడినని చెప్పుకున్నారాయన. కవిత్వాన్ని గురించి ఇటీవల ఒక ఇంటర్వ్యూలో అజంతా వ్యక్తంచేసిన అభి

ప్రాయాలు ఆలోచించదగ్గవి : "కవిత్వం ఒక తపస్సు. రాజకీయ సంబంధమైన దుర్గంధం ఏదీ సోకకూడదు.... కవిత్వానికి సిద్ధాంతాల ఉరితాళ్ళతో నిమిత్తం లేదు ... కవిత్వం అంటే చీకటిలో అన్వేషణ.... క్రియాంత శబ్దాలు నాకు అసహ్యం. వచ్చింది, పోయింది, వస్తున్నాయి. పోతున్నాయి ఇత్యాది శబ్ద ప్రయోగాలు నా కవిత్వంలో మీకు కనపడవు.... ఆధునిక కవిత్వ నుడికారాన్ని సృష్టిస్తున్న వాడిని నేనే. ....అత్యాధునిక కవిత్వ సృష్టికర్తను నేనే. కఠోరమైన ఈ రహస్యం నా మరణానంతరమైనా ఎవరో ఒకరు చెప్పక తప్పదు.... నేను రాసే ప్రతి పద్యం నా దృష్టిలో ఒక పెయింటింగ్....కవిత్వం ఒక అతీత శక్తి. పూర్తిగా అజ్ఞాతం. అజ్ఞాతం."

** ** ** **

అజంతా

జననం— 1929 మే 25. కేశనకుర్రు
తలిదండ్రులు— కామేశ్వరి. శ్రీరామమూర్తి
పేర్లు— పెనుమర్తి విశ్వనాథ శర్మ. విశ్వనాథ్. హసన్. అజంతా
(తెలుగు అజంత భాష కాబట్టి)
ఉద్యోగం – ఆంధ్రప్రభలో ఉప సంపాదకుడు (హైదరాబాదు)
రచనలు— భయపడినవాడు, సూర్యుని ఆత్మహత్య. చెట్లు కూలుతున్న దృశ్యం, కంప్యూటర్ చిత్రాలవంటి కవితలు.

—సుందరం

# కవితా శరథి దాశరథి

యాభైలలో నెలకొన్న తెలుగు కవులలో మూర్ధన్యుడైన కవి. భారతీయ కవితా సంప్రదాయాన్నీ–అధునిక చైతన్యాన్ని తనలో సంయోజించుకున్న సంగమ స్థానం.

'రైతుదే. తెలంగాణము రైతుదే, ముసలి నక్కకు రాచరికమ్ము దక్కునే' అని కవితా శంఖం నదింప జేస్తూ–స్వాతంత్ర్య సమరంలో కొదమ సింహంలా ప్రవేశించిన కవి మార్తాండుడు.

'నేనురా తెలంగాణ నిగళాలు తెగగొట్టి ఆకాశమంత యెత్తరచినాను, నేను రాక్షసి గుండె నీరుగా పద్యాలు పాడి మానవుని కాపాడినాను' అని తన కవిత్వానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రాణ వాయువులనీ, రాక్షస శక్తులకు వ్యతిరేకంగా పోరాడటం వస్తువనీ, మానవుడే తన పతాక అనీ నిర్దేశించుకున్న కవి యోద్ధ.

'మఱ్ఱియాకుపై విష్ణువు మాదిరి శబ్దమున శక్తి' అని శబ్దశక్తిని గుర్తించి దాని ముడులు విప్పి తెలుగు కవితా లోకంలో నూతన భావ వైఖరులకు ఆవిష్కారం కల్పించిన ప్రయోక్త.

మానవుని సమగ్ర జీవనానుభవాలకు దర్పణంగా కవిత్వాన్ని తీర్చి దిద్దడం కోసం వస్తువుకు హద్దులు గీయకుండా శృంగారాన్ని, అంగారాన్ని కురిపించిన స్పందశీలి.

వేదాలనుంచి అధునిక వాదాలదాకా ప్రపంచంలో ఏ మూలనైనా కవిత్వం ఎక్కడ మొలకెత్తినా హృదయ పాత్రికలో దాన్ని అందుకున్న సహృదయ వతంసుడు.

కవిత్వం ఎప్పుడూ పునర్నవ రీతిలో నిత్యసృజన గీతంలో ఉద్గమించవలసిందని, పూర్వం ఎప్పుడో తాము చేసిన తిరుగుబాటును స్మరిస్తూ తృప్తి పొందే శిథిల చిత్తులను విడిచి ఎప్పుడూ ముందుకు సాగిన చైతన్య శీలి.

'నిశ్శబ్దం ఎఱుగనట్టి నిమగ్న'మై కూడా తన కవిత్వం 'మాట్లాడని మల్లెమొగ్గ మాదిరిగా నడచి' వచ్చే సౌకుమార్యం నేర్పిన నిత్య కవితా జీవనుడు.

—ఆచార్య కోవెల సుప్రసన్న

** ** ** **

దాశరథి

జననం— 1927 గూడూరు, ఖమ్మం దగ్గర; మరణం 5–11–1987

విద్య— మెట్రిక్యులేషన్ వరకు ఖమ్మంలో, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంగ్లసాహిత్యం ప్రధానాంశంగా పట్టభద్రుడు

రచనలు— అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, పునర్నవం, అమృతాభిషేకం, కవితా పుష్పకం, నవమి, నవమంజరి, దాశరథీశతకం, తిమిరంతో సమరం, ఆలోచనాలోచనాలు. గాలిబ్ గీతాలు, జ్వాలాలేఖిని, ధ్వజమెత్తిన ప్రజ, Duel with Darkness and other poems.

గౌరవాలు — ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ అవార్డు 1967
కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు 1974
కళాప్రపూర్ణ-ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1975
డాక్టర్ ఆఫ్ లెటర్స్-ఆగ్రా విశ్వవిద్యాలయం 1976
ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి 1977

## డా. రామచంద్ర శర్మగారితో ముఖాముఖి

—తంగిరాల

డా. బి. సి. రామచంద్ర శర్మగారు ఆధునిక కన్నడ కవులలో ప్రముఖులు. గోపాలకృష్ణ అడిగ తర్వాత చెప్పదగిన పేరు ఈయనదే. 1951–84 మధ్య వీరు ప్రకటించిన కవితా సంకలనాలన్నీ కలిపి ఇటీవల 'సమగ్ర కావ్య' అనే పేరుతో ప్రకటించారు. 8-3-88న వారింటికి వెళ్ళినప్పుడు కవిత్వాన్ని గురించిన కొన్ని ముఖ్య ప్రశ్నలు అడిగాను.

"వారంక్రితం నేను, డా. శ్రీనాథ్ ఇంగ్లీషులోకి అనువదించిన సుమతి శతకాన్ని మీకు పంపాను. అందిందా?" అడిగాను నేను.

"అందింది. ఓ మాదిరిగా ఉంది" అన్నారు రామచంద్ర శర్మ.

"ఆధునిక కవిత్వాన్ని దృష్టిలో పెట్టుకుని పరిశీలిస్తే కేవలం నీతిచెప్పడమనే పాత కవుల పద్ధతి కవిత్వం కాదేమో?"

"నా దృష్టిలో కాదు"

"మరి మన ప్రాచీనులు అలా పద్యాలెందుకు వ్రాశారు?"

"పూర్వకాలంలో అన్నీ పద్యాలలో చెప్పడమే అలవాటు. అప్పుడు అసలు వచనం లేదు. నోటి మాటలుగా బొమ్మలు కథలు చెప్పడం ఉన్నా, పుస్తకం మీద పెట్టడం వచ్చేటప్పటికి కవిత్వమే ఉండేది. అందుకే మన వాళ్లు అన్ని శాస్త్రాలనూ పద్యాలలోనే చెప్పారు. అప్పుడు శ్రవణ సంప్రదాయమే ఉండేది. పదిమంది మనస్సుల్లో నాటుకోవాలంటే ఛందోబద్ధమైన కవిత్వమే శరణమయ్యేది, అంత మాత్రం చేత అది గొప్ప కవిత్వం అని అనలేం. ఈ నాడు అటువంటివన్నీ వచనంలోనే చెప్పుతాము స్పష్టంగా."

"మరి రామాయణ మహాభారతాలు?"

"వాటిల్లో కూడా చాలా భాగం డ్రైపాచెస్ కనబడతాయి. పెద్ద కథని కవిత్వంగా

చెప్పడంలో వచ్చే ఇబ్బందే ఇది. మనం కూడా లాంగ్ పొయం రాస్తూ ఉంటే ఎంత జాగ్రత్తగా ఉన్నా ఇటువంటి పాచెస్ తప్పవు"

"అయితే మినీ కవితలో కవితలో కవిత్వం ఎక్కువ ఉందంటారా?"

"లేదు, కవి తన అనుభవాన్నంతటినీ మనస్సులో దిగమ్రింగుకొని రెండు మూడు పాదాల్లో చమత్కారయుతంగా చెప్పడం కూడా గొప్ప కవిత్వం కాదు. అది కేవలం చమత్కారమే. మంచి కవిత్వానికి ఒక ప్రారంభం, ఒక వికాసం. ఒక ముగింపు ఉండి తీరాలి, మినీ కవితలో ఇవి సాధ్యం కావు"

"మరి మన సామెతల సంగతి?"

"పదిమంది అనుభవాన్ని అందరికీ జ్ఞాపక ఉండడం కోసం యతి ప్రాసలలో బిగించి చెప్పినంత మాత్రాన సామెతలు కవిత్వం కావు. ఇవి కూడా సుమతి శతకం నీతుల వంటివే".

"అయితే మంచి కవిత్వం లేక గొప్ప కవిత్వం ఎలా ఉంటుందంటారు?"

"నాకు కవిత్వాన్ని గురించి కొన్ని ప్రత్యేకమైన అభిప్రాయాలున్నాయి. కవిత్వానికి నీతులు వల్లె వేయడం, సామెతలు గుప్పించడం, చమత్కార యుతంగా చెప్పడం లక్షణం కాదు. కవి తన కవిత్వంలో తన్ను తాను తెలుసుకోడం కోసం ప్రయత్నం చేస్తాడు. పాఠకుడుకూడా తన్ను తాను తెలుసుకోడం కోసమే ఆ కవిత్వాన్ని చదువుతాడు. ఈ స్వీయ సత్యాన్వేషణం తప్ప కవిత్వానికి వేరే అర్థం చెప్పలేం".

# ప్రభవనుంచి విభవకు

ప్రభవించిన పత్రిక విభవంవైపే చూపు సాగిస్తుంది. చైతన్య కవిత దృష్టికూడా అదే. ఏ కళలో అయినా ప్రావీణ్యం సంపాదించాలంటే సాధన అత్యవసరం, ఏ భాషలో అయినా సరే మంచి కవిత్వం రాయాలంటే ఆ భాష బాగా స్వాధీనం కావాలి. సంప్రదాయాన్ని వదిలేయాలనుకున్నవాళ్ళు ఆ సంప్రదాయాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవాలి. ఎంత సేపూ మనమూ మన గోలే కాకుండా ఇరుగు పొరుగు భాషలలో ఏం జరుగుతోంది, ప్రపంచ భాషలలో ఏం జరుగుతోంది అనే ధ్యాస కూడా కవికి ఉండాలి. చిత్రకళ, సంగీతం, నృత్యం మొదలైన కళలలో ప్రవేశం కలగాలంటే అభిరుచి, అధ్యయనం అవసరమైనట్లే కవిత్వానికి కూడా అవసరం.

గడచిన ప్రభవ సంవత్సరంలో విద్వాన్ విశ్వం, తుమ్మల వెంకట్రామయ్య, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, దాశరథి అనే నలుగురు సాహిత్య వేత్తలను కోల్పోయాం. మరణం చాలా సహజమూ తప్పని సరీ అయిన విషయమే అయినా సృజన శీల సాహిత్య వేత్తల మరణంవల్ల కలిగే లోటును మరొకరు తీర్చడం అసాధ్యం.

ఈ సారి దాశరథిగారి ఫోటోను అట్టవెనక ప్రచురించి కీర్తి శేషులైన ఆధునిక కవుల చిత్రాన్ని కూడా పాఠకులకు సమర్పించాలనే మా సంకల్పానికి రూపకల్పన చేశాం.

చైతన్య కవితను కొందరు పని కట్టుకొని దూషిస్తున్నా, ఎక్కువమంది ప్రోత్సాహిస్తూ నిర్మాణాత్మకమైన సలహాలు ఇస్తున్నందుకు మా కృతజ్ఞతలు.

సంపాదకులు

## ఈసారి వేదిక నలంకరించిన కవులు

అనువాద కవిత

# అజంతా

## కంప్యూటర్ చిత్రాలు*

గోడలపై జారుతున్న నీడలలో బీభత్సం ఎన్నడైనా
చూశావా
నీవు గోడతో మాట్లాడుతున్నావు
సంకెళ్ళు పడిన చేతులను స్పృశిస్తున్నావు
తిరుగుబాటు ప్రకటించిన గుండె తలుపులు తట్టుతున్నావు
కన్నీళ్లలో దీపం వెలుగుతుందా
రక్తసిక్తమైన పెదలవుపై అక్షర శతఘ్ని మ్రోగుతుందా
ప్రశ్నకు సమాధానం ప్రశ్న
పెద్దపులి గుండెలలో కత్తులు విసురుతున్న మనిషిని నేను.
జీవన క్షేత్రం అదే
ఒక్క క్షణం చాలు
అనంత శూన్యంలో శాశ్వత విశ్రాంతి లేదా విక్రాంతి
ఆ తర్వాత మరి గోడ కనపడదు

సుడిగాలిలో ఎండుటాకుల సంభాషణ ఎన్నడైనా విన్నావా
నీవు నీడతో మాట్లాడుతున్నావు

అసుర సంధ్యవేళ అద్దంలో ఒక రోజు నా ముఖం
చూసుకున్నాను
రెండు ఖండాలుగా చీలిన ప్రతిబింబం వెనుక ఎవరో
ఉవ్వెత్తుగా లేచిన మనిషి
విచ్చుకత్తులవలె మెరుస్తున్న అతని చేతులలో నా ఖండిత
శిరస్సు
మృత్యుముఖంలోనే కదా మనిషి విజృంభణ
గగనవేదికపై అస్తంగత సూర్యుడు నిజంగా ఎంత అందం!

నడుస్తున్న వృక్షకన్యక పదఘట్టన ఎన్నడైనా విన్నావా
నీవు శూన్యంతో మాట్లాడుతున్నావు

---

* పునర్ముద్రితం

ఆశ నిరాశ ఎదురైనప్పుడు
రెండు అస్థి పంజరాలు నవ్వుతున్న చప్పుడు
చల్లని హస్త స్పర్శ మృత్యువు కావచ్చు, స్వప్న కన్యక
ఆలింగనం కావచ్చు
నిషిద్ధ నగరంలో క్రోధాగ్ని నేత్రాలను సమీకరిస్తున్న
మనిషిని నేను
జీవన వ్యూహంలో మనిషి శిలా విగ్రహంగా మారుతున్న
దృశ్యం చూడలేను, చూడలేను
నిత్యం అదే జీవితం అదే రోడ్డు అదే గోడ అదే
గడియారం అవే ముఖాలు దుస్సహం దుర్భరం
దృశ్యం మారకపోతే నిష్క్రమణ
లేదా ఖడ్గ ధారణ

మీట నొక్కగానే తర్జని రివాల్వర్‌గా మారుతుందా
నీవు అగ్నితో మాట్లాడుతున్నావు
ఛద్మవేషధారుల ప్రపంచం ఇది
అంతా ముసుగు వేసుకున్న వాళ్ళే
అక్షరాలకు ముసుగు ఆలోచనలకు ముసుగు
ముఖం వెనుక మరో ముఖం, స్పష్టమైన
సూర్యోదయాలను అంతా భూస్థాపితం చేసుకున్న వాళ్ళే
నడివీధిలో జీవన బీభత్సాన్ని ఆవిష్కరిస్తున్న మనిషి
తనకు తానే అపరిచితుడు
చీకటిని రసప్లావితం చేస్తున్న హంతకుడు కూడా
అపరిచితుడే
అందమైన ఆచ్ఛాదన వెనుక రాక్షసుల కరస్పర్శలో ఎంత
బీభత్సం!

ఆకలి విష కౌగిలిలో రహస్య సముద్రాల హెూరు ఎన్నడైనా
విన్నావా
కొత్త నేత్రాలు ధరించిన మనిషితో నీవు
మాట్లాడుతున్నావు
వర్షధారల మధ్య అన్వేషణ ఎంతో ఇష్టం నాకు
గడియారంపై వాన, చీకటి శతాబ్దాలపై వాన, వధ్య

శిలలపై వాన, నడుస్తున్న దీప స్తంభాల మధ్య వాన
శిథిల ప్రాంగణాలలో ప్రాచీన విహంగాల రెక్కలపై వాన,
ఊపిరి విడుస్తున్న మృత శరీరాలపై వాన,
నగరదేవత వక్షోజాలపై వాన, వాగ్దేవి కన్నులలో వాన
వర్షబిందువులలో జీవన రహస్యం ప్రతిఫలిస్తుందా
ఎక్కడో ఎప్పుడో జార విడిచిన ఆలోచన మళ్ళీ
పరిమళిస్తుందా

ప్రశ్నకు సమాధానం ప్రశ్న
పెద్దపులి గుండెలలో కత్తులు విసురుతున్న మనిషిని నేను
అక్కడే శాశ్వత విశ్రాంతి లేదా విక్రాంతి

** ** **

"జితేంద్రియుని
బుద్ధిలాగు
జేగంటలాగు
కిటికీలో
దీపం!
గోడివతల
గదిలోపల
పేరుకున్న కాంతి
గోడవతల
చీకటి!
హృదయంలో
ఒకటి రెండు
వెలుతురు గాయాలు...."

—నారాయణ బాబు

## మాదిరాజు రంగారావు

### కిర్మీరం నా బింబం

1

జనజీవన కిర్మీరం నా రూపం
నవగాథల కిర్మీరం నా బింబం.
ప్రకృతిలో భాగమై జీవనగతి శక్తులతో
మనిషితో ఏర్పడే హార్దిక రుచి వాస్తవమై,
బల ధన శక్తులతో పదపదం
రణ సహాయుక్తులతో ధరణిపై

దయారహితంగా నీడనుండి తరుమ బడేరు
క్రుధాచరణంతో అగ్నిలోన విసర బడేరు,
ఒకరు ధూమమై సాగేరు పైకి
ఒకరు ఖడ్గమై దూసేరు పైన
అనలపాద శిఖలతో
అవనిపై ఒకరొకరూ

గుండెలో గాయాలనుండి జ్వలించే వేదనతో
మంటపై రాగాలలో నినదించే గాథలతో,
ఎండిన వాలకాలతో చెట్లూ
వెల్గని స్నేహశూన్య దీపాలూ
ఎన్నో నిజపాత్రలకు
నిల్చేను ప్రతీకలుగా.

మనిషిలో ఉంది వెచ్చగా
కదలుతూ రక్తసింధువు
దూకు హరిణ సమూహమై
జూలు విరిసిన సింహమై
ధీ తరంగ చలనంతో రాగమై నిస్వనించే
జీవితాన్ని తలపిస్తూ ఆశతో స్ఫూర్తినిస్తూ.

2

ఆశతో స్ఫూర్తి కలిగే
జీవితంలో ఉదయమై
గూటినుండి నింగిలోకే ఎగసేను
నీడనుండి వీధిలోకి తరలేను,
గాథలతో నిలువునా నివురు కప్పిన శ్రమకణాలూ
కల్పనలో పదపదం అవనిపై అరుణ కిరణాలూ

ఎవరికి వారు ఒంటరిగా కదిలినా బయటికి
పదగతి క్రింద నిల్పి క్షణాల్ని కలసేరు ఒకటై
చెట్టు నీడనో దారి ప్రక్కలనో
మానవీయమౌ రాగ బంధనతో,
కాలానికి వడినిస్తూ
యంత్రాలయి కదలేరు

ఏ కొమ్మ విరిగి మీద పడుతుందోననో
ఏ నింగి ఒరిగి పైన అణచేస్తుందనో
భయలిప్తలూ లేకపోలేదు
అణగే మనోకోశ గర్భంలో
మంచు పొరలు క్రమ్మిన, అ
పాయ శిఖర పంక్తులతో:

ఉదయ కిరణాలపై అలలై బయలుదేరి
తిరిగి మరలేరు ఎండిన ఆకుల విధాన
నీడ కావాలి ఉంది ఏదోగూడ!
తిండి కావాలి ఉంది పనీ ఏదో
అవసరం ఈ జీవితాన
కణకణంలో శక్తి ధార.

# కె. శివారెడ్డి

## వెళ్ళిపోయిన వాళ్ళవి .......

వెళ్ళిపోయిన వాళ్ళని గుర్తు పెట్టుకోవటం ఒక విధి
వెళ్ళిపోయిన వాళ్ళు మన బాధల్లోనూ బాధ్యతల్లోనూ బతికుంటారు
వెళ్ళిపోయిన వాళ్ళకి మనం బాకీదారులం
భూమిపరంగానో జనం పరంగానో
వాళ్ళ ఆశయాల ఆత్మత్యాగాల శిలువ పరంగానో
మనం వెళ్ళిపోయిన వాళ్ళకి బాకీదారులం—
ప్రత్యక్షంగా వాళ్ళ బాకీ తీర్చలేక పోయినా
పరోక్షంగా అవకాశం యిచ్చి వెళ్ళిపోయిన వాళ్ళు
గొప్పవాళ్ళు. వెనుకంజ వేయని వాళ్ళు
వాళ్ళ పట్ల వాళ్ళు కటిక వాళ్ళు —
ఎవడు చేసిందయినా సాధించిందయినా సగమే
మిగతాది మనమీద పెట్టి ముందుగా వెళ్ళిపోయినవాళ్ళు
నెత్తుటి పాదవారులు-
ముళ్ళ రాత్రుల మీద గాయాల గుండెలతో నడచిపోయిన వాళ్ళు
ముందుగా తొలిపొద్దు వసంతోదయం చూడాలని
నేత్రాక్షరాల్ని తొలకరి జల్లులా కురిపించుకుంటూ వెళ్ళినవాళ్ళు—
వెళ్ళిపోయిన వాళ్ళని గుర్తుపెట్టుకోవటం ఒక వేడుక కాదు
ఒక యాగం, ఒక సుదీర్ఘ యుద్ధాన్ని కొనసాగించటం—

*  *  *

"సూర్యాంశువుల సువర్ణ సౌగంధిక వేదికపై
మౌనంగా నృత్యం చేసే మృత్యువు.
పచ్చిక మచ్చికలో, వ్యోమం వాత్సల్యంలో
ఉదార కుమార సమీరాల ప్రేమ పరిష్వంగంలో
మసృణ కిసలయాల గుసగుసలో
పొంచి ఉపహసించే మృత్యువు
హృదిలో దాగిన శత్రువు" —బైరాగి

# రాజేశ్వరి దివాకర్ల

## ఈ శాలువా విలువెంత

అందమైన తోటల్లో విందులు చేసి
అతడు
వెన్నెలనంతా తాకట్టు పెట్టి
చందమామను వడ్డీ మొత్తానికి వదులుకొన్నవాడు.
కొండెక్కిన నక్షత్రాలను
ఎగిరి అందుకొనే తపనలేక
స్థిరమై నిలుచున్నవాడు.
పిచ్చుకగూళ్ళూ పచ్చిక బయళ్ళూ
దుముకుతు వచ్చి
అదుముకొనే కుందేళ్ళూ
మరువని అతని నేస్తాలు.
ఉపగ్రహాలు వివరించే
వాతావరణ చిత్రాలు
సుడిగాలులూ జడివానలూ
అతడు ఆహ్వానించే వార్తలు.
ఉప్పొంగే
కడలి కెరటాల కవతల
కరగిపోయే
మంచుబొమ్మలను చూచి
అందమైన నవ్వు నవ్వినవాడు.
సన్మానాలను సత్కారాలను
స్వాగతాలను అంకితాలను
తన చేయినందు కొన్న
పులకిత వదనంలో చూచి
తాను పొందని
జిలుగు శాలువా విలువ నెరిగినవాడు.

## ఆ కళ్ళు

విగురు విగురున కొాక
విరుగాలి వీచిన కళ్ళు
పూచిన ప్రతి
పూవున కొాక
రంగు పులిమిన కళ్ళు.
ప్రతి కోకిల పిలుపున కొాక
బదులు పలికిన కళ్ళు.
ఒక మబ్బు కురిసినపుడు
పుడమి జలదరించినపుడు
పొడమిన ఆ కళ్ళు.
రెప్పపాటెరుగని దేవతలు
శయనించిన సమయాన
పహరా కాచిన కళ్ళు.
బందీనవుతున్న నాకు
స్వాతంత్ర్య సిద్ధిని పడయరమ్మని
ఊరించిన కళ్ళు.
ఒంటరి ననుకున్న
నా
శీర్షం నిమిరి
నా నీడలో
దేశపటం
ఆవిష్కరించిన కళ్ళు.
నిత్యం
కొనసాగిన
అన్వేషణలో
నాలోనే
తళుక్కుమని
మెరసిన ఆ కళ్ళు........

# తంగిరాల సుబ్బారావు

## నేపథ్య సంగీతం*

"స"

1935 లో
అమ్మ కడుపులో నేను
తెల్లరక్కసి గర్భంలో తల్లి.
'భావ' శిశిరంలో చిట్ట చివరి మ్రోడుగా
బానిసత్వపు జైలులో భయంభయంగా జన్మ.
బాల్యంలో
నా అజ్ఞానపు నీటిమీద ఎన్నో వ్రాతలు .. ....
గాంధీజీ నాయకత్వంలో
సత్యాగ్రహాల మహోద్యమాలు,
పరాకాష్ఠనందుకున్న స్వాతంత్ర్య సమర జ్వాలలు;
ఈ శతాబ్దిలో రెండోసారి
ప్రపంచాన్ని చుట్టుముట్టిన ప్రళయకాల మేఘాలు,
హిట్లర్ ముసోలినీల మారణ హోమాలు........

"రి"

1942 అగస్టు విప్లవం
భగత్సింగ్ సుభాస బోసుల సాహస గాథలు
కాకినాడ 'భయంకరాచారి' కథలు
నా లేత నెత్తురులో లేపిన ఉత్సాహపు వరదలు
కొవ్వూరులో భాషాప్రవీణ విద్యార్థి అన్నయ్య వ్రాసుకున్న
చిన్ని వారాల నోటుబుక్కు ముఖ పత్రం మీద
సిరాతో గీసిన ముద్దుల మూడురంగుల జెండా
గాంధీ, నెహ్రూ, అబ్దుల్ కలాం అజాద్ అట్టబొమ్మల మెడలో
నే వేసిన చెమ్కీదండల జ్ఞాపకాల తళత్తళలు

---

* చైతన్య కవిత-2, 3, 4 సంచికలలో ప్రచురితమైన 'నడచి వచ్చిన దారి'కి అనుబంధం.

నా చిన్ని మెదడులో ఆశ్చర్యం
అద్భుతం
ఆనందం....
చుట్టూ అంటుకున్న అడవి మధ్య
నిశ్చింతగా ఆడుకుంటున్న జింక పిల్ల!

"గ"

1947 ఆగస్టు 15
రాజమండ్రీ టీన్ మిడిల్ స్కూల్లో
నిక్కరు చొక్కాల్లో నేను.
జాతి స్వాతంత్ర్యోత్సవ సంతోష సముద్రతరంగాల సొంపు
గాంధీజీ పెద్ద పటం ఏనుగు మీద ఊరేగింపు
పాటలూ పద్యాలూ హరికథలూ బుర్రకథలూ
ఆనంద సంగీత ఆశ్చర్య సాహిత్య ప్రతిధ్వనులతో నగర భవంతులు
జాతీయ నాయకుల వీరగాథా గాన స్రవంతులు
నెహ్రూ 'మొగలాయీ వంశ' పాలనారంభం.......
ఏడాది గడవకుండానే పిడుగుపాటు
దేశ భవిష్యత్తుకు వెన్నుపోటు
గాంధీజీ హత్య!
కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠంలో
ఖద్దరుధారుల గాంధేయవాదుల మీటింగులో
భయంభయంగా నిలబడ్డవారిలో
బాలుడనైన నేను!
స్వరాజ్యం రామరాజ్యానికి రహదారి అవుతుందని
ఎన్నో ఆశలు ఎన్నో గాలి మేడలు
ఎన్నెన్నో ఊహాగానాలు
గగన కుసుమాలు
యమునానదీ తీరంలో
ప్రజాస్వామ్యపుటిసుక తిన్నెల్లో
నా జాతి కట్టుకున్న పిచ్చుక గూళ్లు!

"మ"

1950 లో
కౌమారంలో

తణుకు హైస్కూల్లో నేను
రిపబ్లిక్ దినోత్సవం స్వాతంత్ర్యంకన్నా గొప్పదన్న భావం
సర్దార్ పటేల్ మరణం
అంతరించిన ఆశాకిరణం
ఉక్కు మనిషికి పట్టిన కాలం త్రుప్పు
నెహ్రూకి తప్పిన ముప్పు.
ఆకల్ని హతమార్చే పార్టీ
సమ సమాజాన్ని సృజించే పార్టీ
క్రమక్రమంగా ఆకర్షించిన కమ్యూనిస్టు పార్టీ.
పి. సి. జోషి, యస్. ఏ. డాంగే, బి. టి. రణదివే,
పుచ్చలపల్లి సుందరయ్య, తరిమెల నాగిరెడ్డి,
రావి నారాయణ రెడ్డి ఉపన్యాసాల ఉగ్రతలు....
ఉత్సాహాలు, ఉద్రేకాలు
రైతుకూలీ ప్రజారాజ్యం కోసం
రణదివే ప్రకటించిన విప్లవం
పోలీసు తుపాకి గుళ్లకు ఎన్నో ప్రాణాల బలి
దేవరకొండ సుబ్బారావు, పేరేపు మృత్యుంజయరావు
నిడుదవోలులో, రాజమండ్రీలో
కాల్చివేత వార్తల భయాల బావు నీడలు....
మా చుట్టుపట్ల
వంకా సత్యం, యస్. ఆర్. దాట్ల, సంకు అప్పారావు,
ఉద్దరాజు రామం అజ్ఞాత వాసాలు....
"ఎర్ర జెండాకూ — జై
కత్తి సుత్తుల జెండాకూ-జై"

"ప"

1952 లో
అహోరాత్రాల చదువు
యస్.యస్.యల్.సి. లో హైస్కూలు ఫస్టు
మహోన్నత శిఖరం ఎక్కిన ఆనందం
పాదరసంలా ప్రవహించే ఆలోచనల మెదడు
యౌవనంలో మోపిన అడుగు.
అమ్మ పసుపు కుంకుమల పొలం అమ్మి

భీమవరం డబ్లియు. జి. బి. కాలేజీలోకి ప్రవేశం
దిగుమర్తివారి గురుత్వం
తెలుగు తేనెలు త్రాగి మనసు పరవశత్వం.
రగులు కుంటున్న ఆంధ్రోద్యమం
సమ్మెలు సమరాంగణాలు
స్వామీ సీతారాం ఉపవాసాల ఉపన్యాసాల
దాగుడుమూతలు
పొట్టి శ్రీరాములుగారి అమరణ నిరాహార దీక్ష
కొనసాగి కొనసాగి
నెహ్రూ–రాజాజీ ప్రభుత్వాలు బిగిసి
ఎగిరిపోయిన ప్రాణహంస
త్యాగధనుని స్వేచ్ఛారిరంస
"జై ఆంధ్రా" మహోద్యమంలో
నేను సైతం ఆహుతిచ్చిన ఒక సమిధ
విధ్వంస కాండలో రైల్వేస్టేషన్‌లో
కొబ్బరికాయల వేగన్ పగులగొడుతున్న మా యువహస్తాలు!
నరసాపురంనుంచి వచ్చే అరవ టీ.సీ.ని పట్టుకొని కొట్టడంకోసం
ప్రకృతి ఆశ్రమం వద్ద రైలు ఆపి
జనప చేలన్నీ వెదుకుతున్న పొగరుకళ్లు!
(అప్పటి మూర్ఖత్వం ఇప్పటికి తెలిసివచ్చి
సిగ్గుతో ముడుచుకు పోతున్న గుండె)........
1953 లో
కర్నూలు గుడారాల్లో
'ముసలి సింహం'తో మూడేళ్లు సాగిన
సంజీవరాయని 'ఆంధ్రా సర్కస్'!
1956 లో
విశాలాంధ్ర 'ఆంధ్రప్రదేశ్'గా భాగ్యనగర్‌లో 'రెడ్డిరాజ్య' స్థాపన
గోపాల, సంజీవ, బ్రహ్మానంద రట్టోడుల అధికారరాగాలాపన.
ఢిల్లీలో పదేళ్లుగా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న
నెహ్రూ 'మొఘలె-ఏ-అజామ్'!
పెద్ద నిశ్శబ్దం
ఉపన్యాసాల హోరు

ఆదర్శాల జోరు
ఆచరణలో మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే!
1961 లో
హడావిడిలో
చైనా చెలిమి బండినుండి
ఊడిపోయిన పంచశీల
ఓడిపోయిన జాతి ఊళ.

"ద"

1964 లో
'బాబరు' అస్తమయం
ముచ్చటగా మూన్నాళ్లు 'షర్షా' పాలనాహర్షం
1965 లో తోక విప్పిన తురకరాజ్యం
నిత్యం గ్రుచ్చుకుంటున్న పక్కలో బల్లెం పారాహుషార్
గట్టిగా బుద్ధి చెప్పిన లాల్ బహదూర్.
మకుటంలేని మహారాజు
రష్యా రాయబారంలో బలియైన 'అలరాజు'!
తిరిగి 'హుమయూన్' ఆగమనం
ఇక మొగలాయీ చరిత్ర అవిచ్ఛిన్నం....
1967-77 'హుమయూన్' పాలనా కాలం ప్రథమదశ
1971 లో మళ్లీ తలయెత్తిన ఇరుగు పొరుగు సంక్షోభం
చంద్రధ్వజంలో చంద్రుడి మీద నక్షత్రం తిరుగుబాటు
మతంలో జాతి, జాతిలో మతం
భాషలో మతం, మతంలో భాష
ఒకే మతంలో జాతికీ భాషకూ యుద్ధం
భయంకర మారణ హోమంలో 'తూర్పు పాకిస్తాన్' ఊళ్లు
గంగాముఖ ద్వారంలో ప్రవహించిన అబలల కన్నీళ్లు....
ఇందిరమ్మ కొట్టిన చెంపపెట్టు
భుట్టో గుట్టు రట్టు
మనం ప్రకటించిన మతగ్రంథం 'బంగ్లాదేశ్'
ముజిబుర్ రెహమాన్ వంగభాషలోకి అనువదించిన ఖొరాను, శహబాస్!
మధ్యలో 'జై తెలంగాణా' 'జై ఆంధ్రా'లు
అన్నదమ్ముల కోడి పందాలు

పల్నాటి యుద్ధాలు, కురుక్షేత్రాలు
పొంగిన రక్తపుటేర్లు
పిచ్చి పీనుగులుగా మారిన వెర్రి పీర్లు....
ఒక ప్రక్క
నక్సల్‌బరీలో పగిలిన పెట్టుబడిదారీ అగ్నిపర్వతం
దేశమంతా ప్రవహిస్తున్న వర్గకలహం లావా....
మరో ప్రక్క
జె.పి. సంపూర్ణ విప్లవ హవా....
శ్రీకాకుళం అదిలాబాద్ అడవుల్లో
చెలరేగిన కారుచిచ్చుల సెగలు
మిన్నుముట్టిన పేదవాళ్ల కోపం పొగలు....
'డబల్ సెవెన్'లో చల్లగా చాప క్రిందికి నీరు
జయప్రకాష్ నారాయణ్ పోరు
మూన్నాళ్ళ ముసలి ముచ్చట్లు
ఈర్ష్యలు శిఖపట్లు
మునిముప్పున తొలి సమర్త
ఇంతలో
"కనకదుర్గా చండసింహం
జూలుదులిపి ఆవులించింది"
ముసలి నక్కలు చిత్తగించిన పలాయనం
గుండె పగిలిన భీష్ముణ్ణి వరించిన స్వచ్ఛంద మరణం!

"ని"

1980–85లలో
మతోన్మాదాలు భాషోన్మాదాలు
రిజర్వేషన్ల ఉన్మాదాలు
ద్రవ్యోల్బణం, ఆకలి, నిరుద్యోగం, దోపిడి
మాయ మాటల గారడి
క్రూర మృగాల మచ్చిక
ఓట్ల మంత్ర తంత్రాలు
క్షుద్ర శక్తుల పూజలు
అరణ్యంలో 'అక్బర్' జననం
అధికార కస్తూరీ పరిమళ ప్రపంచనం

విధివిమాన వాయుపుత్రునిచే 'అక్షయ కుమారు'ని హత్య తర్వాత
'ఇంద్రజిత్తు' రంగ ప్రవేశం
పాలుపోసి పెంచిన పాము కాటువేస్తే
మరణించిన చక్రవర్తి 'హుమయూన్' పిమ్మట
సింహాసన మధిష్ఠించిన 'అక్బర్'ను కని—
పాంచాల రావణ కాష్ఠాల గుగ్గిల ధూపాల ఉక్కిరి బిక్కిరిలో
శ్రీలంక నెత్తుటి దీపం డేంజర్ వెలుగులో
ప్రజాస్వామ్యపు ఖొరాను చదువుతూ
అరుద్దాం 'అల్లా హెూ అక్బర్' అని!

"స"

నేను నిలబడ్డ ఈ మట్టి సంకీర్ణచరిత్రయే
నేపథ్య సంగీతంగా
దీనుల అస్పష్ట భావి చితికిన గ్రుడ్డు సొనయే
అపశ్రుతుల గానంగా,
మేధావుల చేతకానితనం ముఖారి రాగంగా
యువకుల స్తబ్ధత ఆర్కెస్ట్రాగా
ఈడుస్తున్న, చక్రాలు విరిగిన, ఈ బ్రదుకు బండి మీద పయనిస్తూ,
కడగండ్ల గానుగలో పడి నలిగిపోయే
నా ప్రియమైన జనులారా!
ఏం చెయ్యాలో ఆలోచించండి........

## భరతవాక్యం

ఇది
వెయ్యేళ్ల పంటలో
నూరేళ్ల బ్రతుకులో
(అర్థ) 'శతమానం భవతు' అయ్యాక
నడచి వచ్చిన దారివైపు చూసిన సింగపు చూపు!
నా బుర్రలో అనవరతం
అయోమయం రేపే చిమ్మ చీకట్ల మాపు!!

(సమాప్తం)

## ఎన్. గోపి

### ఆ వీధి

ఆ వీధి
కృష్ణశాస్త్రిగారి పాటలా ఉంటుంది.
దిగులు పొగలు నిండిన పాకల వెనక
సముద్రం
ఆవలిస్తూ రవళిస్తూ ఉంటుంది.
దూరంగా పల్లంనుండి నడిచొచ్చే
అనాథ బాలిక పాదముద్రలు
గుండెమీద రంగవల్లులను ధ్వనిస్తాయి.
స్తంభాలమీద ఆనుకొని
తల్లకిందుగా కునుకు తీస్తున్న ఇళ్లకప్పులు
మమ్మల్ని చూసి సద్దుకుని మళ్లీ కళ్లు మూస్తాయి.
గుమ్మాలు నోళ్లు తెరచుకొని
అమాయకంగా ఆహ్వానిస్తాయి.
అరుగులమీద
గతాల నీరవగీతాలు పాకుతూ ఉంటాయి.
భవిష్యత్తు వాకిట్లో
వర్తమానాలు గోలచేస్తూ ఆడుకుంటాయి.
సముద్రంతో పోరాటం చేసి
అలల్ని లొంగ దీసుకొని
ఇంటిముఖం పట్టిన పల్లెకారుజనం
మనుష్యుల్ని చూసి జడుసుకుంటూ
బెదురు నడకలు నడుస్తారు.
కనిపించే ప్రతిదానివెనకా సముద్రం
కళ్లనిండా
గుండెల నిండా
నిర్నిద్ర సముద్ర ముద్ర....

సముద్రాన్ని చూసి చీకటి భయపడుతుంది.
జాలుదువ్వి
వెన్నెల సముద్రాన్ని మచ్చిక చేసుకుంటుంది.
అటువెళ్లే దారులన్నీ
హటాత్తుగా నీటిలో కలిసిపోతాయి.
సముద్రం
ఒక అగమ్య మహాపథంగా మారిపోతుంది.
ఒడ్డున కూచొని మనసు విప్పితే
మురళిలా మూగవోతుంది సముద్రం.
కోట్లాది పెదవులతో
ఒకే పాటపాడే ప్రాక్తన మానవీయ గీతం సముద్రం.
చూపుల కుంచెలతో సముద్రం కాన్వాసుమీద
ఏ చిత్రమైనా గీసుకోవొచ్చు.
కనుచూపు రేఖ కావల
ఎక్కడో ఎప్పుడో పోగొట్టుకున్న జ్ఞాపకాలు
ఒడ్డుకు కొట్టుకొస్తాయనే వెర్రి ఆశ కలవర పెడుతుంది.
సముద్రం
ఎన్నటికీ రాయలేని కవిత్వంలా విలవిలలాడుతుంది.
సముద్రం 'కృష్ణమ్మ' అంతస్సులా వెచ్చగా ఉంటుంది.
బీచీపిల్ల తలదువ్వి
చిక్కులు తీసే అలల అమ్మలా ఉంటుంది.
ఇప్పుడావీధి కూడా 'కృష్ణమ్మ' లాగే హాయిగా ఉంటుంది.
ఆవిడ కొంగు పట్టుకొని
సముద్రం వెంటపడి జీరాడుతుంది.
ఇంటినిండా హొరుతో
పల్లెనిండా చైతన్యం ఘోష పెడుతుంది.
కారులో వెళ్లిపోయే సముద్రాన్ని చూసి కళ్లు వర్షిస్తాయి.
మళ్లెప్పుడొస్తావు తల్లీ అని అడగలేక
వీధులు బేలగా చూస్తాయి.
ఇప్పుడా వీధి
మళ్లీ కృష్ణశాస్త్రిగారి పాటలాన్నే మిగిలిపోతుంది.
(ఒరిస్సాలోని గోపాల్‌పూర్ సముద్ర తీరంలో.......)

# ఆచార్య తిరుమల

## నోటి బుడగలు

కడుపులో అగ్నిపర్వతాల్ని దాచి
మాటల్లో మలయ పవనాల్ని ప్రసరించే వాడు
ఎక్కడో అక్కడ
ముల్లు గుచ్చుకొన్న బుడగలా ప్రేల్తాడు!
వాడి బ్రతుకుని
నోటి బుడగలు చేసుకుంటుంది శిశులోకం !
వాడి చూపు మరకల్ని
చిరునవ్వుల వెన్నెలతో కడిగేస్తుంది బుధలోకం!
అణుశక్తినేగాని అక్షర శక్తిని
గుర్తించలేని ఆ నిరాశోపహతుడి చితాభస్మం మీద
ఒక కోయిల కమ్మని గానాన్ని వూదుతుంది!
చైత్రం తన చరణాల్ని మోపుతుంది!
ఆ ముల్లు మీద ఒక సూర్య కిరణం నిలుస్తుంది!
అరుపుల్లోంచి, కేకల్లోంచి అభ్యుదయ ఖడ్గాలు మొలిస్తే
కాకులదే పట్టాభిషేకం! గుడ్ల గూబలదే అధికార శ్లోకం!
ఆకలి లేకపోతే సృష్టి లేదు!
ఆ జ్వాల ఆరితే దృష్టి లేదు; రస పుష్టి లేదు
గతికి ప్రగతి ఆహారం!
చితికి శవం ఆహారం!
రుద్రవీణల్లో భద్రనాదం వుంది!
తీగలు తెంపితే ఏ వీణా పలకదు!
అపశ్రుతిని సవరించాలి
శ్రుతిలో ప్రాణాల్ని కదిలించాలి!
కడుపులో అగ్ని పర్వతాలు దాచుకున్నవాడు
కళాద్రోహి! వ్యామోహి!
ఎక్కడో ప్రేల్తాడు, పాపం!
నోటి బుడగల కోసం!

# సౌభాగ్య

## బొమ్మా - బొరుసూ

సూర్య కిరణాల, నక్షత్ర కాంతిపుంజాల గిలిగింతల్లో తుళ్ళిపడుతూ
చక్కని నీలి ఆకాశం తెరకేసి సాగుతూ,
సముద్రం అలలతో వూగుతూ
రేయీ పగలూ మధ్య రెపరెపలాడుతుంది ప్రపంచం.
విభిన్న వర్ణాల పూలు శాంతివిద్యుద్వికసనాలై
గాలి పిల్లన గోవితో గారాలు పోతాయి.
అరణ్యాలు చిక్కని తీగల కౌగిలింతల్లో
గంభీర తన్మయ తపస్సులో నిశ్చలంగా వుంటాయి.
తెల్లటి పల్చటి మేఘాలు
ఏ లోకాలకో మాధుర్య సందేశాలతో తేలిపోతూ వుంటాయి.
జలజలా సెలయేళ్ళు స్ఫటిక స్వచ్ఛంగా
పర్వతాల ఆనంద బాష్ప ప్రవాహాన్ని
ప్రపంచానికి పంచడానికి పరుగెడుతాయి
ఏకాంతంలో మౌనంగా కళ్ళలో కళ్ళుంచి
చూపుల వారధి మీద గంధర్వ గానాన్ని
పరస్పరం ప్రసారించుకుంటున్న పడచుజంట జన్మసాఫల్యంతో జ్వలిస్తుంది.
పాలు తాగే పసిబిడ్డ తల్లిని ప్రేమతో నిమురుతోన్న తల్లితలపుల్లో
పాలసముద్రాలు పరవళ్ళు తీస్తాయి
ప్రపంచంలో ఎంత అందం! ఎంత ఆనందం!
ఫక్కున నవ్వుతూ కళ్ళలో కాంతి పూలు రువ్వుతూ
కాంక్షా తీరం వెంట వెన్నెల రెక్కలు విప్పి
ప్రణయ రాగాల మీద తేలి సృష్టి వయసు వాడిని
అణువణువులోకి ఆకర్షించి నిక్షిప్తీకరించి
పాటకాని, మాటకాని, మనసు తీగ మీటిన
మంటని మండిస్తూ యవ్వన వతులు.
కళ్ళు నడిపిస్తే కాళ్ళు నడిస్తే టీలో మునిగి, పొగలో వెలిగి
సినిమాలో విశ్రమించి, రంగుల సిటీ రంగుల రాట్నంలో

తిరిగి తిరిగి, అలసటలోనే ఆనందంలో, ఆనందంలో ఆదమరిచి
నిర్వికల్ప నిద్రలో నిశ్చలంగా యువకులు
పాడుపడిన శిథిలాల్లో కూడా ప్రాణశక్తి ప్రభవించి
నరాల కెక్కి జీవన మాధుర్యానికి చేవనిస్తుంది
పాత బడిన కథల్లోనూ, గాథల్లోనూ
మొలకెత్తుతున్న బాల్యంలాంటి చరిత్ర
ప్రౌఢ ప్రపంచానికి పారవశ్యం కలిగిస్తుంది.
నమ్మకమే నాలుగు మూలలా ప్రాకారమై నిలిచి
విషాద విషాన్ని వెలివేస్తుంది.
ప్రపంచ నిఘంటువులోంచి వేదన అన్న పదం వెళిపోతుంది
రాజులు లేని, రాజ్యాలు లేని వసుధైక కుటుంబ గీతం
పాలపుంతల్లో ప్రతిధ్వనిస్తుంది.

*          *          *

నల్లని ఆకాశం దిగులు తెర
కరాళంగా వేనవేల క్రూర నేత్రాల్లాంటి నక్షత్రాలతో
ప్రళయభీకరంగా లేచిపడే కెరటాల సముద్రంతో
కెవ్వున అరిచే అనాథ ప్రపంచం!
దిక్కులేని పసికూనల్లా భూమికడుపు చీల్చుకొచ్చిన పూలు,
తీరని కోరికల్లా తేలిపోయే నిరాశా మేఘాలు
గడ్డ కట్టిన అజ్ఞానంలా, ఆలోచనల్ని చొరనీని గుడ్డినమ్మకంలా అరణ్యం.
ప్రపంచం క్రూరం! ఘోరం!
ప్రకృతి సహజమైన ప్రణయానుభూతిలో
ప్రపంచాన్ని విస్మరిద్దామనుకున్న పడుచు జంటల కలల్ని
మతాల వున్మాదాల ఆస్తుల అంతరాల రాబందులు అసహ్యంగా వెంటాడుతాయి.

వున్నవాళ్ళ పిల్లలే వుల్లాసంగా వుంటారు.
బాల్యం తెలీని బాలలంతా
పుట్టుకతోనే శ్రమను స్నేహితుడిగా చేసుకుంటారు.
క్షణం క్షణం కష్టపడుతూ కణాల్ని కన్నీరుగా వొదిలే
యవ్వనవతి సౌందర్యం
చెమటతో కలిసి ఆవిరై
పంచభూతాలకి కొద్ది కొద్దిగా పంపకాలవుతుంది.

ప్రపంచంలో ఎంత దుర్మార్గం! ఎంత దుర్భరం!
టీలో మునిగి, పొగలో వెలిగి
సినీమాలో మనసును చిందర వందర చేసుకుని
రంకుల సిటీ రంగుల రాట్నంలో దిక్కు తోచక
నిద్ర రాని రాత్రిళ్ళతో నెరవేరని కోరికల్తో; దహించే దరిద్రంతో
వుడికిపోతుంది యువత
ఇంతలో యుద్ధాలు! విప్లవాలు! కోట్ల మంది మరణం!
యుద్ధానికీ యుద్ధానికీ మధ్య శాంతి!
అభివృద్ధి కుక్క మూతి పిందె లేసి
పిందెకు పిందెలై న్యూట్రాన్ బాంబులై,
స్టార్ వార్స్ ఐ
వచ్చే జనానికి చచ్చేంత దిగులు!

## రేపటి విజేత

అసహనం ఆవహించిన, వుద్రేకం వూపేస్తున్న
కుర్రవాణ్ణి కోపగించుకోకండి
నాజూకుదనానికి, నాగరికతకూ,
ముఖస్తోత్రాలకూ, ముందు వెనక ఆలోచనలకూ
సున్నితమైన మాటల్తో సూదులు చల్లడానికీ
అలవాటు పడిన వాళ్ళకు వాడు కొరకరానికొయ్య
చుట్టు ముట్టే అగ్నిజ్వాల
నెత్తి మీది బాంబు
నవ్వుల వెనక దాక్కున్న నాగుబాముల్ని వెలికి లాగుతాడు.
కరస్పర్శ వెనుకనున్న కాపట్యాన్ని బహిర్గతం చేస్తాడు.
పలకరింపుల వెనకనున్న ప్రయోజనాల్ని బట్టబయలు చేస్తాడు
కంటి చూపుతోనే మనిషిని అంచనా వేస్తాడు.
దోచుకునే వాళ్ళ కుట్రల్నీ, ద్రోహచింతనల్నీ
నడిరోడ్డు మీద నలుగురికీ వుపన్యసిస్తాడు.
ఇళ్ళూ, కార్లూ, ఆస్తులూ, అహంకారాలూ
ఆకాశం ఎత్తు ఎదిగిన అతని కంటికి
వణుకుతూ బెదురుతాయి.
సత్యమొక్కటే తెలిసిన లేతయువకుణ్ణి స్వప్రయోజనాలకుపయోగించకండి

కోపగించకండి.
చైతన్య ప్రతీకలాంటి అతడికి
చేతనైతే చేయూత నివ్వండి.
వైఫల్యాలకు వెనుకంజ వేస్తే వెన్నుతట్టండి
రేపటి విజేతకు నేడే నీరాజనం పట్టండి.

## అన్వేషణ

లోపించిన దానికోసం లోకమే వెదుకుతున్నట్లుంది.
చర్చలతో, వుపన్యాసాలతో
వుద్గ్రంథాల పేజీల చటంకింపులతో
వుద్యమాల వుద్రేకంతో
ఆవేదనతో, అసహనంతో
మనుషులు మ్రాన్పడి పోతున్నారు.
ఎవరి నిమిత్తంతోనూ పనిలేని క్రూర 'నాగరికత'
అణ్వాయుధాల్ని అమ్ముతోంది.
అభిప్రాయాల్ని అమ్ముతోంది.
అందాల్ని అమ్ముతోంది.
కాళ్ళ కింద పాకే కాలసర్పం లాంటి వ్యాపార విషసంచలనం పైన
మనిషి నిలువెల్లా విలవిల్లాడిపోతున్నాడు.
మనిషికి లొంగిన చందమామ,
శక్తిగా తలవంచిన సూర్యుడు
దూరదర్శినులకు లొంగిన దూరతీర నక్షత్రాలు
పాదాక్రాంతమైన సమస్త ప్రకృతీ
మాటాపలుకూ లేకుండా మౌనంగా వుండిపోయాయి.
ప్రకృతి మీద మనిషి సవారీ చేస్తే
ప్రశ్న మనిషి మీద సవారీ చేస్తోంది
ఈ అస్తవ్యస్థ పరిస్థితులకి, ఈ అసమానతలకి
ఈ అశాంతికి, ఈ ఆనందరాహిత్యానికి
వేగానికి లొంగని ఈ ఆవేదనకీ
కారణాల్ని అన్వేషించమని దారుణంగా హింసిస్తోంది
లోపించిన దానికోసం లోకమే వెదుకుతున్నట్లుంది.

## బి. అయిలయ్య

### రహస్య చిత్రం

హఠాత్తుగా తెగిపోయిన ఓ ఒంటరి నక్షత్రం
చీకటి మైదానాలలోకి మౌనంగా ప్రయాణిస్తుంది
ఆ నక్షత్రం అడుగుల శబ్దానికి చిరునామా లేదు
చితికిపోయిన కనుపాపల్లోంచి
రెప్పలు నిశ్శబ్దాన్ని తోడుతాయి.
ఈ కనుపాపల్లో ప్రతి దృశ్యం చిట్లిపోయిందే
తెగిన నక్షత్రాన్ని భుజానవేసుకొని
వాడు ధరించిన మౌన కిరీటం నిర్గమ్యం
దిశగా పరుగెడుతుంది.
గుడ్డివానిలా చీకటిని తగుల్తూపోయి
గాలినిపట్టి మౌనస్వరాలుగా మారుస్తాడు
అప్పటికది రాత్రిరెండో జాముకావచ్చు
అది పగలే చీకటి వెన్నెల కావచ్చు
ఉన్నట్టుండి తుపాకులు ఇనుపమేజోళ్ళతో
స్వర్ణాలయంలోకి ప్రవేశిస్తాయి
పంచనదుల్లో తల్లి బూడిదను
నిమజ్జనం చేస్తారు
సత్యం ధర్మం ఊతకర్రలు పట్టుకొని
గెంటుతూ పోతాయి
న్యాయ దేవత కోర్టుబోనులో తలక్రిందుల
శీర్షాసనం వేస్తుంది
కలాల నాలుకలను తెగ్గోసి జైలు
ద్వారాలకు తోరణాలుగా వేలాడదీస్తారు
న్యూస్ ప్రింట్ కోతే పత్రికల
అసలైన కంఠాన్ని తెగనరుకుతుంది
రూపాయి విలువ నూరు పైసలు లేదని తెలిసే
కరెన్సీల మీద నిస్సిగ్గుగా సంతకాలు పెట్టిన

గవర్నరులను గౌరవించడానికి
వాడు 30 వ తేదీనా ఏడువందలని
ఎత్తుకోవటానికి అల్లంపల్లి అడవుల్లో
మృత్యుముఖంలో తన్నుకుంటాడు
అప్పుడూ మౌనమే!
మధ్యయుగాల శిథిలాల్లోకి
నడిచి పోతాను అంటున్న రాజస్థాన్
అది నిజంగా ఎడారే
గుజరాతు నడివీధుల్లో సునీతలు
పరుగెడుతూనే ఉంటారు
21వ శతాబ్దపు గడపల్లోకి
మేము మౌనంగానే తిలకిస్తూ ఉంటాము
పెదవి కదిలిందో ఊపిరితాడును
ఎవడో లాగేస్తాడు అజ్ఞాతంగా.

* * *

"తుడిచివెయ్ ఈ ఆకాశాన్ని
చీకటికి రాత్రిరంగు పుయ్,
నిద్ర మరుగున ఉండే గుడ్డిసముద్రంలో వెన్నెలను ముంచెయ్,
మూసుకో నీ కళ్ళు, గాలి వల తెంపెయ్,
రాత్రి పైటగల సముద్రపు అడుగుల సద్దును మూసేసి
త్వరగా రా
నీ నిశ్శబ్దపు అడుగుల్లో నా ఊపిరి సలుపుకోనీకుండా,
నిశ్శబ్ద ప్రశాంతపు చీకట్లో
నిద్రలేని శూన్యంలో
ఆత్మవిశ్వాసంతో మనిద్దరం కలిసిపోదాం
ముఖాముఖి.
జగత్తును పొడిపొడి చేసి, ఆకాశంలోకి విసిరెయ్
చీకటి మధ్యలోంచి రా నా ఎదలోతుల్లోకి."

—బిష్ణుదే (వంగకవి)

## శిఖామణి

### కల నా రహస్య జీవితం

కల కేవలం మీకు
రెండు మామూలు అక్షరాల కలయిక
కలకోసం మీరు మహా అయితే
ఒక రాత్రినో లేదా రెండు కనురెప్పలను దగ్గర చేసిన
ఒక క్షణాన్నో ఖర్చు పెడతారు.
కల-రెపరెపలాడుతున్న అలల పుటలతో
నన్ను అధ్యయనానికి ఆహ్వానించే సముద్ర పుస్తకం.
నా కలల మీద బుల్‌డోజర్లు నడుస్తున్నాయి.
కల-వుడుకెత్తిన నా నెత్తుటి సరోవరంలో
వికసించిన తప్త జ్వాలాసుమం.
నా కలలను బాయ్ నెట్లు రక్త పరీక్ష చేస్తున్నాయి.
కల-నామనో వల్మీకంలో నిద్రించిన
ఊహా సుప్త భుజంగాలను మేలుకొలిపే
అద్భుత నాగస్వరం
చట్టం నా కలలను నిర్దయగా శాసిస్తుంది.
కల-నా మథిత మేధో పయోధి జనిత
అసంతృప్త హాలాహలం
నా కలల సముద్రంలో కనిష్కలు నిష్కారణంగా కూలుతున్నాయి.
కల-నా మెదడు బావిలో కదలీకదలక కదలాడే
నిశ్శబ్దపు తాబేటి తరంగం
నా కలల కళ్లల్లో భోపాల్‌సర్పం విషంచిమ్మింది.
కల-నా కంటి చెట్టున నిత్యం వికసించే
వసివాడని కన్నీటి పుష్పం.
నా కలలకు ట్రానిస్టర్ బాంబులు-యాసిడ్ బల్బులూ
పహరాకాస్తున్నాయి.
కల-నా గుండె ప్రమిదలో అనవరతమూ ఆరకవెలిగే నెత్తుటిదీపం.

నా కలల మీద ఖలిస్తాన్ కొత్త కరెన్సీని ముద్రింప చూస్తుంది.
కల-నా మౌన విహాయసంలో
పడగలెత్తి పరుగులెత్తే ధ్యానసూత్ర పతంగం.
నా కల నీరుకొండై నన్ను భయపెడుతుంది.
కల-నాలో నేను-నాతో నేను
నిత్యం సలిపే అవిశ్రాంత ఆత్మపోరాటం
నా కల రూప్ కన్వారై నన్ను కలవర పెడుతుంది.
కల నా రహస్య జీవితం.
ఇంకా-నా కల పూర్తవ కుండానే
పంజాబ్ రక్తంరంగుతో హోళీ జరుపుకుంటుంది.
అక్కడ బెంజిమెన్ మొలాయిస్
ఇనుపకంఠాన్ని కౌగలించుకున్న వురితాడే
ఇక్కడ వేషం మార్చుకుని
నిన్ను అనుసరిస్తు వుంటుంది.
వులిక్కి పడ్డ నిన్ను చూసి
నీ వెనక నున్న నెల్సన్ మండేలా అప్యాయంగా
నీ భుజం మీద చెయ్యి వేస్తాడు.
పుట్టగానే తల్లిని పోగొట్టుకున్న అనాథ బాలుడు
నిద్దట్లో లేనితల్లి పాలరొమ్మును ఆకలితో తడిమినప్పుడు
ఆ దృశ్యాన్ని దగ్గరగా చూసి, భయంతో వొణికి
ఆ పసికళ్లనుండి దూరంగా పారిపోయిందీ-కలే
అసహాయతా పరిష్వంగం నిర్వీర్యుల్ని చేయగా
అదను చూసి ఆకలిపులి పంజా విసిరితే
చేతులెత్తిన చార్మినార్ మహోన్నత శిఖరాలనుండి
రెక్కలు తెగిన పక్షుల్లా
మృత్యుకుహరంలోకి దూకిన దైన్యపు దేహాలలో
రక్తంతోపాటు గడ్డ కట్టిందీ-కలే-
ఇప్పుడు కల
మారీచుడు ధరించిన మాయా రూపపు
వన్నె చిన్నెల హిరణ్య మృగం కానే కాదు
బోనునుండి తప్పించుకుని
పర్జన్య గర్జనలతో జనావాసంమధ్య

తిరుగాడుతున్న మృగేంద్రం.
దిక్కులు పిక్కటిల్లే భయద ఘీంకారాలతో
అడవుల మధ్యనుండి
మానవ మహారణ్యంలో ప్రవేశించిన భద్రగజం.
నే ప్రేమించే ఓ నా మానవుడా
పక్షులు కలలు కనలేవు
పశువులూ కలలు కనలేవు
ఈ విశాల విశ్వంలో
నిద్రించిన నీ నరాల సంగీతాన్ని మీటేదీ
నిలిచిపోయిన నా చైతన్య సరిత్తులను పారించేదీ
గడ్డగట్టిన నీ నెత్తుటి జలపాతాల్ని వురికించేదీ
కల మాత్రమే!
రా! మనం మనిషి కోసం కలలు కందాం
ఈ నాటి మన కల
భవిష్యదాకాశపు సూర్య బింబమై
తప్పక ప్రజ్వరిల్లుతుంది.

* * *

"భూమి మీద ప్రేలుతోంది విషాదం
అదుగో ఆ సుదూర మేఘాల దూది పింజల్లాగ
పసుపు పచ్చని ఆకుల మీద నడుస్తూ
గాలి నడిగి మనశ్శాంతి ఎరువు తెచ్చుకుంటాను
సరియైన దారి ఇదీ అని చెప్పలేను
నాచుమీదా ముళ్ళమీదా నడుస్తున్నాను
అగాధపు అంచున నిలుచున్నాను
ఓర్పుగా, ఎంచేతనంటే కాలం అనంతం"

—అలెగ్జాండర్ ప్లెషిన్ (శ్రీశ్రీ అనువాదం)

## వి. ఆర్. విద్యార్థి

### పిల్లలే నయం

మనకంటే బుద్ధెరుగని
చంటి పిల్లలే నయం.
చీమ కుట్టినప్పుడు గుక్క పట్టేడ్చినా
ఆ చీమను నలిపేశామా
ఆ నొప్పి తగ్గిందా
ఇక దాని గుర్తే ఉండదు
ఆ బాధే ఉండదు.
ఎప్పట్లా గుట గుట పాలు తాగుతూ
కేరింతలు కొడుతుంటారు. మనమో?
కుచ్చుకున్న ముళ్ళ నెలాగూ పెరికేస్తాం.
ఆ నొప్పి తగ్గడానికేవేవో మందులూవాడతాం.
ఐనా తరచూ నొప్పి తగ్గదు.
వండిన అన్నాలూతినం!
ఎల్ల వేళలా
గాయమైన చోటే చూసుకుంటూ ఏడుస్తాం.
మనకంటే బుద్ధెరుగని చంటి పిల్లలే నయం.
విరిగిన బొమ్మల్తోనే ఆడుకుంటారు
మరీ బొమ్మలేవి మిగలకుండా పోయాయా
ఏ గడ్డి పరకనో, మట్టి పెళ్ళనో దొరక బుచ్చుకుంటారు. మనమో?
విరిగిన కలల్నెలాగూ అతుక్కోలేం
అట్లని వాటిని పారేయనూ లేము
పోనీ వాటితో గప్‌చుప్‌గా ఉంటామా అంటే అదీ లేదు!
విరిగిన ప్రత్యంగాన్నీ నిమురుకుంటూ
వెక్కి వెక్కి ఏడుస్తుంటాము.
మరి కొత్త వాటివైపు చూడాలంతేనే
వెన్నునుంచి తన్నుకొస్తుంది భయం!

# యం. కె. సుగమ్‌బాబు

## చీకటి సొరంగంలో రైలు

కన్నీటి తెరవాపలవెంట
సుడి గుంటాల్లాంటి పట్నాల సందిట్లోకి
పల్లెలు—
కిటకిటలాడే రైలు స్టేషన్లు అనాథ సత్రాలు
బాధలజొన్న సంగటి
ప్లాట్‌ఫాం బుజ్జగింపులో,
నిద్రలో ముద్దబంతిపూలు రేకులు విడిపోతూ—

ప్రయాణంలో వేసే ఆలోచనలన్నీ
చురకత్తులే—
ఒళ్ళంతా చీరికలే!
కంగారు పడిపోతూ పాయలుగా విడిపోయే ఆలోచనలన్నీ
ఓటిపడవలే!
భవిష్యత్తు తిమింగలం-
నెత్తిమీద తిరిగే ఫ్యాన్‌కేం తెలుస్తుంది ఉక్కపోత?
గోడకు వేలాడే గడియారానికేం తెలుస్తుంది గుండెకోత?
సమరం ఎన్ని విధాలో తెలియని అమాయకత్వం
ఆయుధం అంటే ఏం తెలుస్తుంది?
.........................................
చీకటి సొరంగంలో రైలు!

# విన్నకోట రవిశంకర్

## విన్నటి కల

మళ్ళీ అప్పుడే నిద్ర లేపకు
నిన్నటి కల ఇంకా పచ్చిగానే ఉంది
కళ్ళలో గాలి దుమారాన్ని లేపుతూ
ఎర్రని దుమ్ము రేపుతూ వస్తుంది నిద్ర
ఎప్పుడో విరిగిన జ్ఞాపకాల దుంగల్ని
తెప్పలా మోసుకుంటూ
వరదై వస్తుంది కల.
నిన్నటి కలలో నేను నిరాశ్రయుడినైనాను
నిన్నటి వరదలో ప్రాణభయంతో విలవిలాడాను
మళ్ళీ అప్పుడే నిద్రా?
కనిపించని గాయం కల;
వచ్చేపోయే నిద్ర ఏ వేళప్పుడో చేసి వెళిపోతుంది
ఊహల భయాల
మృత్యు రహస్యం కల.
మరణించిన మిత్రునిలా
వేలభంగిమలలో కనిపించి,
అంతులేని ఆలోచనల మధ్య
తళుక్కుమని మెరిసేది కల
నిన్నటి ఈ కల
ఇంకా పచ్చిగానే ఉంది.

## జ్ఞాపకం

అమ్మా
నీ జ్ఞాపకం
ఫోటోలా దుమ్ము పడుతోంది
వేల చిత్రాలుగా నన్ను ఉక్కిరి బిక్కిరి చేసిన జ్ఞాపకం

అంతులేని చలనచిత్రమై
నా కళ్ళలో కదలాడిన జ్ఞాపకం,
ఒకేఒక గమనింపబడని పంటగామారి
మనసులో ఏ మారుమూల గోడకో
వ్రేలాడుతోంది.

అనుక్షణం ఆవేశంలా నోరు విప్పిన జ్ఞాపకం
ఇప్పుడు ఏ మాటల మంత్ర ధ్వనికో
గుహతలుపులా తెరుచుకుంటోంది,
జలపాతంలా కళ్ళలోంచి ఉరికిన జ్ఞాపకం
అపుడపుడు ఒక అశ్రుకణం మాత్రం ఐ
కనుకొనల్లో నిలుస్తోంది
నీ మాటై
నీ చూపై
నీ నడకై
విశ్వరూపం దాల్చిన జ్ఞాపకం,
ఎప్పుడో నీ గురించిన ఒక మాటగా
మరుగుజ్జురూపంలో దర్శనమిస్తోంది.
నీ స్పర్శతో మృత్యువు తన మార్మికతను కోల్పోయింది;
ఇప్పుడు మాకది
జీవితంలో ఒక భాగంగా అలవాటై పోయింది;
అందుకనే,
నీ గురించిన జ్ఞాపకం మరణించినా కూడా
అమ్మా,
మేమది గమనించమేమో!

# రామా చంద్రమౌళి

## ప్రశ్నలే ఆయుధాలు

నిజానికి నీకు కావలసిందేమిటో నీకు తెలుసు
ప్రతి రాత్రి
కొవ్వొత్తి ప్రాణాలను వెలుతురుగా మార్చి కోల్పోయినట్టు
నువ్వు నీ బలహీనతలను తెలుసుకుని
తెలిసి బలియై పోతూండడం కూడా నీకు తెలుసు
తెలిసే నాటకమాడుతున్నాము–సస్పెన్స్ లేదు
కాని కళ్ళుమూసుకోగానే
హృదయాన్ని పొడుచుకుతినే స్మృతులు
ఎదపై రాబందుల్లా వాలుతాయి.
మండే అందాలై వీధుల్లో ఆక్రందనలు వినిపిస్తాయి
పార్లమెంటులోని బూతుకేకలు సిగ్గుతో చంపేస్తాయి
పరుగెత్తే పాదాల ఆక్రందన వెనుక
తుపాకీ ధ్వనుల వేట వినిపిస్తుంది
అన్నీ రక్తపు మరకలే
వెనుక మంత్రోచ్చారణల మధ్య
బైబిల్ పఠనం ప్రతిధ్వనిస్తూంటుంది
అంతా శాంతి శ్శాంతిః శ్శాంతిః
లాకర్లలో కట్టలు నిద్రపోతుంటూయి
కాగితాల డిగ్రీలను కప్పుకుని
కళ్ళు కన్నీళ్ళను కారుస్తూంటాయి
విశ్వవిద్యాలయాలు ఒట్టి కాగితాలను పంచే కార్ఖానాలై
రాక్షసులను తయారిస్తూంటాయి
ఎవడో ఓ పిచ్చివాడు
"దేశం తగలబడిపోతోంది పహరా హుషార్" అని ఎలుగెత్తి అరుస్తూంటే
వాణ్ణి వీధులవెంటబడి తరుము న్నారు
"వందేమాతరం—" అంటూ....,

తలెత్తి ఆ పాత హిమాలయాలను చూస్తే
కళ్ళు సముద్రాలవుతున్నాయి తరాలను తరాలనే కోల్పోతూ,
ఆత్మను చంపుకుని రాయిలా ఈ నేలపై
పడిఉండాలంటే సాధ్యం కావడం లేదు
శిలనైనా శిల్పాన్ని కమ్మని నా చరిత్ర ప్రబోధిస్తోంది-
ఒట్టి మట్టిలోనుండి బ్రతికించే జీవం పుట్టినట్టు
బీడువంటి నాలోనుండి
కోట్ల పోరాటాలు మొలకెత్తుతున్నాయి-
మొలకలు ప్రశ్నలై,
ప్రశ్నలు ఆయుధాలై,
ఆయుధాలు త్యాగాలై
పాదాలను నదులను చేసి
నదులను పలికే ఎదలను చేసి
ఒక ప్రవాహమై, ప్రకాశమై ప్రచండమై
మంటను గాలి బ్రతికించినట్టు
ఈ దేశపు వీధులలో బిగించిన పిడికిళ్ళ నిజాయితీని కవాతు చేయించాలి
కల్లోలం ఎన్నో రాత్రులు కళ్ళనిండా ప్రళయించి ప్రళయించి
ఓ కన్నీటి బిందువును మిగిల్చిపోతుంది—
కన్నీటిలోనుండి
మనిషి పుడతాడు-చీకట్లోనుండి సూర్యుడు పుట్టినట్టు.

*　　*　　*

## అజంతా చిత్రం

శతాబ్దాని కొక సారి పుష్పించే చెట్లు
(కూలుతున్నాయి) నా కళ్లముందు
ఆ దృశ్యం (చూస్తున్నాను)
మెదడు మోడరన్ ఆర్ట్ (వేస్తోంది)
ఎడద ఆలోచనామృతం (జుర్రుతోంది)
అజంతా చిత్రాల్లో క్రియలుండ కూడదు మరి
అందుకే ఈ కుండలీకరణాలు సరి!

(తంగిరాల అముద్రిత కావ్యం 'కవిసేన' నుండి)

# అడిగోపుల వెంకటరత్నమ్

## నెలకు ముప్పై సంవత్సరాలు

నువ్వు రాసిన వుత్తరం చేరింది
క్షేమ సమాచారం తెలిసింది
నా విషయం షరా మామూలే
నేను రాస్తున్నది అంతా మామూలే!
నిశ్శబ్దం లేని లైబ్రరీలో
నిశ్శబ్దం బోర్డుల్ని చూస్తూ
శబ్దంలో నిశ్శబ్దాన్ని వెతుక్కొంటూ
స్తబ్ధంగా ఒక మూల కూర్చుంటున్నా!
చెదలు పట్టి చినుగు పట్టిన
పుస్తకాల్ని దుమ్ముదులుపు కొంటూ
సోదర సోదరీ మణులు
చించేసిన పేజీల్ని వెతుక్కొంటూ
నా పాదాలు ప్రదక్షిణ చేస్తున్నాయి!
రాదని తెలిసిన యం.ఓ. కోసం
వస్తుందనే ఆశ నా వెంట బడగా
ఎదురైన వ్యక్తిలో పోస్ట్‌మేన్‌ని చూస్తూ
నా కళ్ళు భ్రమిస్తున్నాయి!
గోల్డులేని గోల్డు మెడలు చేబట్టి
విద్యాలయం నుండి విశ్వంలోకి
ఉద్యోగం కోసం నిరుద్యోగిగా
ఈ వత్సరం నన్ను ప్రసవించ బోతూంది!
ఎదురు చూసే జీవితానికి
నేనెంత ప్రథమ సంతానం ఐనా
ముప్పూట తిండి దొరికే నౌకరీ ఒకటి కావాలి
నిరుద్యోగిగా నే కాలాన్ని కొలవలేను
కారణం నీకు తెలుసు
నిరుద్యోగికి నెలకు ముప్పై సంవత్సరాలు!

# వనమాలి

## భవిష్యత్తుని తాగుదాం

కారుమేఘాల్ని పొగలా శ్వాసించే
మహాసముద్రం కూడా
ఒక చిన్న పడవయినా ప్రవేశించాకే
అర్థం పరిపూర్ణత్వం పొందుతుంది—
ఆకాశాన్ని భూమిని పెకిలించే తుఫానులు
యుద్ధం ప్రకటించినప్పుడు
ఇక్కడ
ఓడలాంటి ద్వీపాలు మునిగి పోలేదు
ఎడారిలాటి గతంలోంచి
అర్థం లేని పదాల చెత్త
కొట్టుకొచ్చింది—
నాకు తెలుసు పదాల మేత పడేసి
కాలాన్ని మచ్చిక చేసుకోలేమని
అందుకే
నిశ్శబ్దపు స్ట్రాని
సూర్యోదయంలో ముంచి
ఉదయాన్ని తాగుతున్నాను
భవిష్యత్తునే
అడవిగుర్రం సంకెళ్ళు తెంపేస్తున్నాను.

(ఏప్రెల్, 1985)

*　*　*

"శతాబ్దాలనుంచి నీ గాయాలకు అంటుకుని ఉన్న
కొరడాను చూపించు, నీ రక్తంతో
మెరుస్తున్న గొడ్డలిని చూపించు"

—పాబ్లొ నెరుద

## సోమసుందర్

### చైత్రం-వికసిత చైతన్యం

పూవులు పెళ్ళి చేసుకుంటున్నాయి
వస్తారా, చూసొద్దాం........
ఆరామవాటికల ఆనంద నిలయాలలో
తపోవనాల కళ్యాణ వేదులలో
ఎంత సరదా! ....ఎంత సంబరం!
పూవులు పెళ్ళి చేసుకుంటున్నాయి
వస్తారా చూసి వద్దాం!
గుచ్ఛాలే తప్ప కులాలెరుగని పూవులు
స్తబకాలే తప్ప మతాలెరుగని పూవులు
మాధుర్యమే తప్ప మద మాత్సర్యాలెరుగని పూవులు
మంచితనాల నిర్మల మనస్సులకు మారు పేర్లు!
ఈ ఉగాది వేకువనే-
ఈసుహాస సదస్సునే-
పెళ్ళి చేసుకుంటున్నాయి పూవులు
వస్తారా చూసి వద్దాం సందడిగా!
ఈర్ష్యాళువులై తలలు చెడిన మోళ్ళూ
పర బోధోపజీవనులై లోక కంటకాలైన ముళ్ళూ
రుధిరాన్ని ఉద్గారం చేసుకు బావనీండి!
తళతళలాడే పరిమళాలకు స్వాగతం పలకండి!
అవునవును-ఇదే నవ్యాగమ చైత్రం!
జీవన లోకానికి నవవికసిత చైతన్యం!
ఆమని కోకిల గాంధర్వం పూరించింది
అవని శ్యామల వసనం ధరించింది
మలలూ పొలాలూ ప్రతిరుతించాయి....
కోనలూ సానువులూ ఆహ్వానించాయి
కాననాలూ కాసారాలూ ప్రతిచలించాయి
గుమగుమలాడే చల్లదనాలు గుప్తరించాయి

ఎంత సంతోషం అంతటా........!
ఎంత పీయూషం అన్నింటా........!
పూవులు పెళ్ళి చేసుకుంటున్నాయి
వస్తారా చూసొద్దాం!
ప్రతి కొత్త కెరటామూ ఒక కొత్త పేరుతో
ప్రతి కొత్త ప్రసవమూ ఒక కొత్త శోభతో
ప్రభాతానిల శ్రవణాల నూదింది
నవజీవనానంద మంత్రాక్షరాలు పలికింది
సెలయేళ్ళ తటాలు తప్పెటలు మ్రోయించాయి
పంట కాలువగట్లు చిగురాకు బూరాలూదాయి
చెరువు నడిబొడ్డులో నిలచి
జలక్రీడలాడుతూన్న కలువలూ కమలాలూ
మోమెత్తి పరకాయించి చూస్తున్నాయి!
అవునవును ఎంత ఊపు గుండెల్లో?
పూవులు పెళ్ళి చేసుకుంటున్నాయి—
వస్తారా చూసి వద్దాం!
నిరంతర శ్రమ జీవనులు మధుపాలు
కష్టనిష్ఠుర జీవితం గడచి పోయిందని
ఇకపై శ్రమఫలితంగా మధువు
పుష్కలంగా లభిస్తుందనీ—
ఒక్కటే రొదగా ఝుంకరిస్తున్నాయి....
అవును మరి, శిశిరానికి శిరఃఖండన జరిగింది
సీతువునిస్సీమితంగా తొలగింది
కొమ్మల్లో కొరవి దయ్యాల్లా వ్రేలాడిన
హిమనా తుహినాశ్రువులు తరుమబడ్డాయి—
దూరంగా.... దూరదూరంగా!
తోటల్లో తోపుల్లో పూలకు పెళ్ళికారు వచ్చేసింది!
మకరంద తుందిలమై ఆనందం పరిమళించింది
ఎంత శోభాయమానంగా జరుగుతోంది
పూవుల పెళ్ళి! వస్తారా చూసి వద్దాం!
తలిరాకు జొంపాల పరదాల తొలగించుకొని
సంప్రదాయ మతబంధాల ఖాయిదాలు వీల్చుకొని

అప్పుడే వచ్చింది, అసూర్యంపశ్యకోకిల భామ!
మంగళగీతం తాను వినిపించందే
పూల పెళ్ళి ఎలా జరుగుతుందని
ఆమెకెంత గర్వం? ఎంత స్వాతిశయం?
'ఇంకేముంది? మిత్తి నెత్తి మొత్తింది!'
అనుకున్నాయా వృద్ధ జంబుకాలు ద్వేషంగా........
ఎర్ర చీరలతో ముస్తాబై—
ఎంచక్కా వచ్చేస్తోంది పలాశం!
పచ్చల పళ్ళెరంలో పసుపూ కుంకుమా
వాయినాలందిస్తోంది చిరునవ్వు లొలుకుతూ....
పలాశం ఠీవిగా నడచి వస్తోంటే
ముప్పనాతి ఈత తుప్పలు సైతం
తప్పుకొని దారినుంచి ప్రక్కల కొత్తిగిలుతున్నాయి!
    పూవులు పెళ్ళి చేసుకుంటున్నాయి—వైభవంగా
    వస్తారా, వస్తారా చూపొద్దాం!
బొర్రలు పెంచుకొన్న కుబేరుల చైత్ర రథాలను
లాగిలాగి ఆయాసంతో రొప్పుతూన్న శాపగ్రస్తులు
శుకమహర్షులు వినిపించే-
విముక్త గీతాలకు పునరుజ్జ్వలించాయి!
    నల్లగా దర్పంగా నిలచిన తాళవృక్షాలు
    తలల గెలలు భుజాల కెత్తుకొని
    కోర మీసాలు త్రిప్పుతూన్న యమకింకరులు-
పాత ఎల్లలను దిఃకరిస్తున్న కొత్త విగుళ్ళ ఎగతాళికి
సిగ్గుపడి తలలు వంచుతున్నాయి........
    అంతటా ఎంత విచిత్రం! ఎంత వైభోగం?
    చింతలూ చిదుములూ లేని సుమానంద రాగం!
    పూవులు పెళ్ళి చేసుకుంటున్నాయి—
    వస్తారా చూసి వద్దాం పోయి....
అదేమిటి ఆ కొండ వార మడుగు?
తుప్పల్లో క్రీనీడల్లో బెబ్బులి అడుగు!
ముళ్ళే ఎర్రగా పూసినట్లు, పాషాణాలు రుధిరం కక్కినట్లు........
యౌవనోత్సాహుల తలలపై పడిన పిడుగా అది?

కాకుంటే విస్తృతమవుతున్న దేమిటా నెత్తుటి మడుగు?
కుసుమోద్వాహ వేళ–ఎందుకా రక్త కళ్యాణం?
ఎక్కడ పెళ్ళి పందిరి? అసలెక్కడ నీరా సందడి?—
అనుకుంటూ దిక్కులు వెదుక్కుంటూ
దారీ తెన్నూ తెలియని వెర్రినాగమ్మలకు
తన పొడుగాటి బారుచేతులు చాపి కొబ్బరి చెట్టు
ప్రక్కనే ఉన్న వేప గుబురు చూపుతోంది!
పెదవులపై చిరు చేదులుంటేనేం గాక—
గుండెలనిండా తీపి కబురులే, వేప గుబురుకు....
అప్పుడు ప్రారంభమైంది, ఉద్యాన వాటికల ఉద్వాహ వైభవం!
అప్పుడు మ్రోయించింది గగనం విజయగర్వ తూర్వారావం!
సుందరులూరేగుతున్న కోలాహలం........
పూవుల పెళ్ళి జరిగిపోతోంది వస్తారా చూసి వద్దాం!
(ఆకాశవాణి హైదరాబాదు వారి సౌజన్యంతో)

** ** **

"ఓ తల్లీ ఒకప్పుడు
గగనంలో నక్షత్రాలు చూచే నీ కళ్ళు
ఇవాళ ధరిత్రిమీద రాలిన మెతుకుల్ని
చూస్తున్నాయి
క్రమంగా నీ ముఖంలో నవ్వు నిష్క్రమించడం
చూచాయి ఈ కళ్ళు
నీ పెదవులు పాటల్ని త్యాగం చెయ్యడం
చూచాయి ఈ కళ్ళు
నీవిప్పుడు జీవితం చెక్కిన ఒక
మౌనమూర్తివి
బాలికనుంచి భార్యవరకు ఒక యాత్రవి!"
—శేషేంద్ర

# కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి

## హిమాని

(ప్రభవ శరత్తు సంచికలో ప్రచురింపబడ్డ 50 వ కవిత తర్వాత)

51

చంద్రుడొక్కడే. తదియనాడు దండములందుకొనును
చవితి నాడు శాపములందుకొనును
స్థితిని బట్టి గదా గౌరవము

52

ఆకాశ నైల్యమే అంబుజాకరమునందు ప్రతిఫలించి
హృదయంగమ మగుచున్నది.
పామర భాషలు పండితుల యందు భూషింపబడును

53

మేఘోజ్ఝిత జలము-నదిని గలిసి మధుర మగుచున్నది.
సముద్రమున కలసి క్షారమగుచున్నది.

54

దీపము క్రిందనే చీకటియున్నది.

55

డేగ పావురమును తినుచు "ఆహా! నేను దీనిని
ఆకటి దుఃఖమునుండి తరింప జేసితిని కదా" యనుకొనును

56

సర్పము : ఈ కప్పలను నా కుక్షియందుంచిన
వాని జీవితము నిరపాయము.

గ్రద్ధ : నా గూడు చెట్టు చివరనున్నది. నీ కందు
నిరపాయము, రమ్ము.

57

మన నీడ మనల నెండనుండి రక్షింప లేదు.

58

పసుపు పూసిన రాటకే సున్నము తగిలిన ఎరుపగును.
హరిచందన ఖండమునకాభయము లేదు.

59

వెన్నెల రేల చుక్కల కాంతి కన్న
చీకటి రాత్రుల మిడుగురుల కాంతియే
యెక్కుడు ప్రయోజనకారి.

60

ఒక సూర్యుని లోపము నెన్ని కోట్ల చుక్కలు
తీర్ప గలవు.

61

మిడుగురు తన అల్ప ప్రకాశమునకై
సూర్య పతనమును వాంఛించును.

62

పెక్కు చుక్కలు భంగపరుపలేని ఘూకమును
ఒక్క సూర్యు డేడ్పించుచున్నాడు.

63

చిన్నదైనను పొగడకు గల గౌరవము
మోదుగునకు లేదు.

64

మేఘాచ్ఛాదితమైన పూర్ణిమా రాత్రికంటె
నిర్మేఘమైన అమావాస్య రాత్రి యోగ్యము

65

ముత్యము వలె ప్రకాశించి జనుల మోసగించు
పద్మపత్రాంబు కణముకన్న నీట కలిసిన
నీటి బిందువు ఘనము.

66

కొబ్బరి పువ్వు కొంచమైనదే కాని ఫలితమెక్కువ.

67

ఉన్న చుక్కల వైపు కన్ను త్రిప్పక
లేని చంద్రునకై రాత్రి పరితపించును.

68

బురదయందు పుట్టినను సరసిజము
తన సువాసనచే ఎల్లర ప్రేమకు పాత్రమగును.

69

నిరాధారమైన తమమునే సూర్యుడు ఖండించుచున్నాడు
కాని చెట్లనాశ్రయించిన నీడలను స్పృశింపగలుగుచున్నాడా!

70

పాదపములు తమ వలన నుండి పుట్టిన నీడలనే
భానునినుండి రక్షింపుచున్నవి.

71

వర్షించినపుడు పయోధులతోపాటు పడియలు నిండును.
భగవంతుని ప్రేమ విశ్వజనీనము.

72

జలపాతమున బింబించిన చంద్ర బింబము
శకలములైనంత మాత్రమున శశికి లోపమేమి?

73

చంద్రకాంతిని నాసించిన యిందుశిల
చంద్రుడున్నంతవరకే జలమును స్రవించుచున్నది.
ప్రతిఫల మాసింపని పర్వతము నదీరూపమున
నెల్లప్పుడు తన ప్రేమమును స్రవింప జేయుచునే యుండును.

74

నదిలో సుడిగుండములున్నట్లు నదీ జలమే తెలుపును

74 ఎ

చవితి నాడైనను పౌర్ణమి నాడైనను
చంద్రుని జూచిన కలువ ఒకే విధమున వికసించును.
నిర్మల ప్రేమకు నీచతయు ఉచ్చతయు లేదు.

75

ఒక్కసారి చక్కగా వికసించిన చేమంతి విరిగి ముడుగదు.
అది తొడిమనుండి రాలువరకు అట్లే స్వీయసౌందర్యముచే
జగత్తును ముగ్ధీకరించును

76

క్షణము వ్యాకోచమై క్షణము సంకోచమందు
కలువను జేరిన తుమ్మెద జీవితము దుఃఖప్లావితము.

77

ఎండలో నిలువ బోయినప్పుడే నీడ పడును

78

సముద్రమున కిష్టము లేకపోయినను ఆకాశము ప్రతిఫలించును.
ఉన్నతున కడ్డు లేదు.

79

ఇసుక ముసుగులలో అట్టహాసము చేయు
నెడారి వృక్షముపై తృణమేని నిద్దుర వోవదు

80

నిస్వనమైన మరుభూమిలో నీటిచలమను గాంచినప్పుడు
బాటసారి భగవంతుని కీర్తించును
నికృష్ట సమయములోని మేలు నిర్భరానంద ప్రదమే

81

భరింపరాని యెండలోను
భరింప గలిగిన వెన్నెలలోను
నీడ పడుట తప్పదు
ఎట్టి దశలోనున్నను మృత్యు వలంఘనీయము

82

కొండిక పురుగు లిముడుటకు
కుళ్ళ గుంటలు చాలును
మహామీనములకు మహా జలాశయములు కావలయును

83

కీటకము సమీపించిన పువ్వులకు కీడు చేయక విడువదు
తుమ్మెద డాసిన విరికి తోషము కలిగింపక విడువదు

84

వాడిపోవు సౌందర్యముగల కుసుమమును
వాడని శోభగల హంస తూలికయు
ఒక్కసారిగా సార్వభౌముని మూర్ధ మలకరించినవి
పుష్పము సాయాహ్నమగుసరికి బుగ్గి పాలైనది
హంసతూలిక యట్లే ఆనంద నృత్యము చేయుచున్నది
సామర్థ్యహీనుడు స్థానమును నిలుపుకొనలేడు

85

అద్దములో ప్రతిఫలించిన రూపము ఆ వ్యక్తితో పోవును.
చిత్రపటమునందలి రూపము చిరకాలముండును.

అధముని హృదయములోని కృతజ్ఞత
ఆ వ్యక్తి యెదుట నున్నంతవరకే
ఉత్తముడు ఇతరోప కృతిని
సర్వదా స్మరించును.

86

తేనె పట్టంతయు తేనెతో నిండియుండదు.

86 ఎ

బాలచందురునందు కందు బాహిర్లిలను
బాలునియందు మాలిన్యము కలుగునా.

87

తేనె తగిలిన కురులు తెల్లబడును
తేనెటీగ తెల్లబడుచున్నదా?

88

వార్షికాకాశమునందలి సూర్యబింబము
వారిజ మెట్లు భావింపగలదు

89

వర్షాదినములలో చీకటియని ప్రజలు వాపోయిరి.
సూర్యుడు మబ్బు తెరల చాటున మెరపు నవ్వులు
నవ్వెను. అతనికి చీకటి కనిపింపదు కదా!

90

చంద్రుడు చీకటులను తరిమి వేసెను
చీకటులు వియోగి హృదయమును శరణు చొచ్చెను.

91

వెన్నెల యింత మనోజ్ఞముగ నున్నదే నీ వేల
తలవంచుకొంటివని కలువ తామరను ప్రశ్నించెను.

92

శ్యామలాంధ్యమును రూపు మాపుటకు శశి
శ్యామలాకాశమునే ఆశ్రయించినాడు

93

చీకటికురులందే తారలు పువ్వులైనవి.

94

నీరు పైకి నిశ్శబ్దముగను ప్రశాంతముగను కనుపట్టెను
నీటిలో ఒక చేప యింకొక చేపను భక్షించుచున్నది.

95

క్షారోదకము సూర్య కరస్పర్శచే మేఘమండలము
జేరి మధురోదక మగుచున్నది.

96

మబ్బులో పుట్టినను మెరపునకు మబ్బు వినుకులంటవు

97

స్వాధీన పతిక తలయెత్తినది
మావి కొమ్మనుండి వ్రేలు మాలతి కనుపించినది
ఖండిత తలవంచుకొని కాలివ్రేలితో నేల వ్రాయుచున్నది
పూవు రేకుల తునకలు గాలికి కొట్టుకొనివచ్చి
కాలికి తాకినవి.

98

ఆకసమునఎగురు పక్షికైనను ఆవాసము భూమియే.

99

ఎండలో సాలెగూడు ఎన్నో రంగులతో మెరసినది
ఈగ దానికే భ్రమించినది.

100

చెట్టు : కీరమా! నా పచ్చని ఆకుల వలననే
నీవు రక్షింప బడుచున్నావు.
చిలుక : నా పచ్చని రెక్కల వలననే
నీ యాకులు రక్షింప గలిగినవి.

(పై కవితల్ని సేకరించి పంపిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి ధన్యవాదాలర్పిస్తున్నాం—సం.)

"ఆమె తన సోమారితనం మీద నిప్పులుమిసింది
ఆమె నల్లటి చూపే నా దినాల సూర్యుడు
తమ చెమటను తామే తాగుతూ అనంతంగా నర్తిస్తున్న
ఆ మగాళ్ళవైపు ఆ చీమ సర్వ సన్నద్ధమై
కృపాణ శిరస్త్రాణాలతో వెళ్తుంది"

—చికాయా యూ థామ్సి

## వి. పి. చందన్‌రావ్

### జ్ఞాపకమా నన్ను మరిచిపో!

నాతో ఇన్నాళ్ళు నిలిచి
నాతో ఇన్నాళ్ళు నడిచి
నా తోడుగా – నాకు తోడుగ్గా
రాగంగా నిత్య యాగంగా
అంతర్లీనంగా–నా నిలువునా
ప్రవహిస్తూ–ప్రవచిస్తూ–పరిమళిస్తూ
ఉడికిస్తూ–ఊరిస్తూ–ఊరడిస్తూ–ఊగిసలాడిస్తూ–ఉయ్యాలలూగిస్తూ
అపుడే పడగ విప్పి బుసకొడుతూ–భయపెడుతూ
పువ్వై విచ్చుకుంటూ–పువ్వుకింది ముల్లుగా గుచ్చుకుంటూ
కనిపించని మనస్సుని పొడిచి గాయాలు చేసి
వినిపించని కళ్ళల్లో గేయాలు పూయించి
నాతో స్నేహించి–హసించి–సుఖించి–దుఃఖించి
నన్ను ఊహల ఉయ్యాలలూగించి
అపుడే అపోహల లోయల లోతుల్లోకి నన్ను ఒలికించి
అంతలోనే ఆశల ఆకాశాల్లోకి ఉరికించి
దిక్కుల ముక్కల్లోకి ఊపిరిని చేసి ఊదేసి
పువ్వువంటి బతుక్కి–ముల్లువంటి పహరాగా నిలిచి
మలుపు మలుపుకీ చిలిపిగా పిలిచి
ఈ శిలని తొలిచి–శిల్పంగా మలిచి
శ్రుతుల స్మృతుల్ని ఒళ్ళంతా చుట్టి
అంతా చేసి–మెత్తగా మత్తుగా మందహాసం చేస్తూ
నన్ను విడిచి–నాలోంచి నడిచి పోతూకూడా
వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ వెక్కిరిస్తూ
తిరిగి నాలోకి దూసుకొచ్చి
నన్ను చుట్టేసుకుని వెక్కిళ్ళు పడుతూ
ఏడుస్తూ–ఏడిపిస్తూ
మనసు వీధి మలుపుమీద నిలబడి

చెమర్చిన నయనాలతో చూస్తున్న
నా సుఖ జ్ఞాపకాల్లారా
నా దుఃఖ జ్ఞాపకాల్లారా
నన్ను మరిచిపొండి
నన్ను నన్నుగా
తెరవబోతున్న కన్నుగా
కొత్త తలుపులు తెరుచుకో నివ్వండి!

* * *

## అగ్నిధార

తెలంగాణా విప్లవ రక్తంలో తడిసిన
కవితాపారావతం
ఛందోబద్ధ పద్యాల నందనవనంలో విహరించే
విజయ ఐరావతం
సింహాసన మెక్కిన 'ముసలి నక్క'ను తరిమికొట్టి
జన్మజన్మాల బూజును దులిపి శుభ్రం చేసి
కడిగి ముగ్గులు పెట్టి
తెలంగాణా క్షుభిత జనతను
కోటిరత్నాల వీణగా మలచిన భవ్యశిల్పి!
కవితా పుష్పక మెక్కి
అగ్నిధారలు కురిపిస్తూ
తిమిరంతో సమరం చేసి
గాలిబ్ గీతాల సెంట్లు పూసి
ధ్వజమెత్తిన ప్రజను మెచ్చి
'ఆస్థాన కవి' వేషంలో వచ్చి
అధికారంతో చేతులు కలిపాడు....
విప్లవాల గొంతులు నులిమాడు....
"ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి శీతాద్రి...."
(తంగిరాల అముద్రిత కావ్యం 'కవిసేన'నుండి)

## వి. వీరాచారి

### పద నేస్తం!

వస్తావా నేస్తం
అనుభవాల లోయల్లో వేలాడ్తున్న
రక్త చిత్రాలను కోసుకొద్దాం.
చరిత్రధ్వారానికి గుచ్చి
చైతన్యం వాకిట అలంకరిద్దాం—
ఆలోచనల గునపాలు కావాలి
ఆవేశపు స్ఫూర్తి ఉండాలి
భూతకాలిక మృత్తిక పొరల్ని
పెకలిస్తే కాని నిజాల అవశేషాలు
నీ నయనాల చూపుల కంటవు
'కాల్మొక్త బాంచాన్దొరా' అన్నోడు
పిశాచాల గోరి కట్టాడు
విచ్చర పిడుగై రాచరికపు కోటల్లో
భూకంపాల్ని పుట్టించాడు—
చెట్ల ఆకుల్ని సూటిగా చూస్తే
కొమ్మల్లో శిశిరఘాత ముద్రలు కనిపిస్తాయి
పద నేస్తం!
అనుభవం పునాది మీద
మన ఆశయ సౌధాన్ని కడదాం!
గోడమీది పిల్లుల్ని గోతిలో పాతేద్దాం!

* * *

"గడియారం నడవని
పాతకోట గోడకన్న
సూర్యుణ్ణి ఉరికించే
ఫ్యాక్టరీ కూత మిన్న"

—దాశరథి

# సాత్యకి

## దాహం

అస్తమించే సూర్యబింబం రాత్రిని పుచ్చగింజలా రాల్చి పోయింది. గొడుగులా విచ్చుకుంది చీకటి నలుదిశలా. ఇప్పుడు జ్ఞాపకాల పక్షులన్నీ మధువుతో రెక్క విప్పుతున్నాయి. అరవిరిసిన క్రోటన్స్ పూల జాడలు నీ అరచేతుల నీడలనుకుని తోటల్లోకి పరుగెత్తిన క్షణాలు ప్రసరించే చీకట్లు నీ కనురెప్పల ప్రతిబింబాలనుకున్న స్మృతులు—బహుశా భూమి నీ దేశం, వసంతఋతువు నీ మతం మళ్ళీ ఏ ఋతువులో దర్శనమిస్తావో? ఏ పూల గుత్తుల పొత్తిళ్ళలో నీ రేఖాచిత్రం స్ఫురిస్తుందో?

* * *

నా రెక్కలు విరిచి ఒంటరితనానికి కట్టివేశావు. బ్రతుకును సమాధానం లేని ప్రశ్నగా గమ్యం లేని ముళ్ళబాటగా మార్చి వెళ్ళిపోయావు. కానీ సుదీర్ఘ సముద్రతీరంలాంటి కాలం దారంలా నన్ను నీ వైపు లాక్కుపోతూనే వుంది.

ఘనీభవించిన రెండు వర్షపు చినుకుల్లాంటి నీ కళ్ళను నా కలల నివాస మందిరాలుగా మార్చుకుందామనుకున్నాను. కానీ కురవడానికి సిద్ధంగా వున్న రెండు మేఘాల్లాంటి నా కళ్ళల్లోంచి రక్తం పితుకుతున్న ఆ ప్రేమ స్వప్నాలే, నా సమాధికి ఇటుకలయ్యాయి.

* * *

నా నిద్రకూడా నీవే పోతున్నావేమో, అందుకే రాత్రులంతా నేను మేలుకొనుంటాను. జీవితపు స్వల్ప ఆతిథ్యాన్ని శాశ్వత నిద్రాదాహం దహించే చితిగా మార్చావు. నీ దీపంగా వెలిగించుకున్నావు.

# గన్ను కృష్ణమూర్తి

## వేమ సూర్యుణ్ణి చూపే సూర్యుణ్ణి!

నేను చీకట్లలో బ్రతుకుతోన్న సూర్యుణ్ణి
ఆకలితో వెలుగుతోన్న దేవుణ్ణి
సూర్యుణ్ణి చూపించే సూర్యుణ్ణి
చంద్రుని మ్రింగి, సూర్యుని ప్రసవించే దినాన్ని
సూర్యుని మ్రింగి, చంద్రుని ప్రసవించే రాత్రిని
దివారాత్రాలని బంధించే సంధ్యని.
నావి ఆలోచనలు కావు
రక్తంతో వెలిగే జ్యోతులు, రక్తంలా వెలిగే జ్యోతులు.
నావి భావాలు కావు
సహస్ర కమలంలో పూచిన పూలు, బంగరు వాసనలతోడి వెండి నగవులు.
నాది రచన కాదు చచ్చి, పుట్టే ప్రక్రియ.
చచ్చి, ఆలోచనల్లోకి
భావలహరుల్లోకి చొచ్చుకుపోయే
పరకాయ ప్రవేశం.
అలా చచ్చీ, పుట్టీ, పుట్టీ, చచ్చీ
మనిషి, మనిషి గుండెల్లో తేలే గుండెకాయ ప్రవేశం.
నేను నా అంతరంగాన్ని
అక్షరాల పావురాల కాళ్ళకు బంధించి
విను వీధుల్లోకి వదలుతున్నాను.
సాహితీ ప్రియులకు అందిస్తున్నాను.
బదులుగా వాళ్ళ గుండెల్ని అందుకుంటున్నాను.
అందుకే—
నా వృత్తి గుండెల మార్పిడి!
అంతరంగాల మార్పిడి!
నా ప్రవృత్తి నిశ్శబ్ద చౌర్యం!

# కడియాల పాపాయమ్మ

## చితికిన చేతులు

భాగ్య నగరం
ప్రజావాహినితో
ఉప్పొంగి పొర్లుతూ
ఎదిగి పోతూంది
ఎల్లలు లేకుండా!

నగరపు శివార్లలో
కొండలు కొట్టించి
కడుతున్నారు భవనాలు
కొండరాళ్ళ గుట్టపై
రాళ్ళు కొట్టే ముసలి కోటిగాడు
పదేళ్ళ బిడ్డ తెచ్చిన
పచ్చడి కూడు
పట్టి నోట బెట్టబోతూ
అబ్బాయని మూలిగె బాధతో!

బిడ్డ అదిరిపడి చూచింది
అయ్య కండ్లలో నీరు
"అయ్యా కండ్లకు మళ్ళా దెబ్బ తాకిందా?"
"లేదు బిడ్డా చెయ్యి మంట పుడ్తుండాది."
అయ్య చేతుల రక్తపు చారలు
చూసిన చిన్నారి బిడ్డ
మనసు కరిగి కన్నుల్లో ఉబికింది
చిట్టి చేతులతో
గోరుముద్దలు చేసి
అప్యాయత రంగరించి
అయ్య నోటి కందించింది.

ఆ చిన్నారి చూపు
అల్లంత దూరంలో
షామియానా వేసి ఉన్న
బంగ్లాపై బడ్డది
"అయ్యా నువ్ కొట్టిన బండలతోనే
ఆ బంగ్లా కట్టిరి గదా?
అరు ఇందు సేసు కుంటున్రు
మనన్ని పిలవ కూడదా!
ఆరి సేతులేమీ సితక నేదు గదా
ఆరెందుకు సెమిశాల్తో తింటున్నారు?"

ఆ చిన్న బుర్ర సందేహాలకి
ఆ చిన్న బిడ్డ అమాయకత్వానికి
అనుభవశాలియైన తండ్రి
చిరునవ్వు నవ్వాడు!
అయ్యను నవ్వించగల్గినందుకు
ఆ చిన్నారి మనస్సు పొంగి పోయింది
విందు భోజనం తిన్నట్టుగా!

* * *

"నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరం ముఖం మీద నిజంగా ఒక మచ్చ
నిరుద్యోగి వెంకట్రావు చావడు
చావటం అనే మహాపాపం చెయ్యకుండా
న్యాయాధిపతులు ఎప్పుడూ అతన్ని కాపాడుతూ ఉంటారు
రోడ్ల మీద భిక్షకులు అతనిలో ఎప్పుడూ కొత్త ఊపిరి పోస్తూంటారు
జీవిత మాధుర్యాన్ని గూర్చి చీమసైతం అతన్ని హెచ్చరిస్తూ వుంటుంది
నిరుద్యోగి వెంకట్రావు ఎన్నటికీ చావడు
అంచేతనే అందమైన ఈ సాయంత్రం వేళ నగరం అంతటా అపస్వరాలు
వెంకట్రావు నడుస్తున్నంతమేరా చెట్లు కూలుతున్న దృశ్యాలు"
—అజంతా

ఆర్వీయస్. సుందరం

## డిగ్రీలు

మనుషులందరికీ
ఎప్పుడూ
ఏదో ఒక డిగ్రీతో సంబంధం.

వేసవి వేడినీ
దేహంలో నిప్పునీ
కొలిచే డిగ్రీ .......
చూపుల ఎత్తునూ లోతునూ
అవక్రతనూ వక్రతనూ
కొలిచే డిగ్రీ........
అధికారం కళ్ళలోంచి చేతుల్లోంచి
సిగరెట్టు నిప్పులోంచి
గాయాల లోతుల్లోకి
గుండెల్లోకి గుచ్చుకునే
మూడో డిగ్రీ........
నాలుగోది నా గొడవ.

చుక్కల్ని అందుకోవాలనే
పిచ్చి ఆశతో
బండల్ని దాటుకుంటూ
కొండ ఎక్కిన తర్వాత—
అటు చుక్కలూ అందవు
ఇటు భూమికీ చెందవు.
డిగ్రీలవల్ల పెరిగేది బరువూ బాధా
వాపూ అని తెలుసుకునే సరికే
కొండ మీద మిగిలింది నేనూ నా డిగ్రీ
కింద వైరాగ్యమంత లోయ.

డిగ్రీ అన్నది
చదువుకు విలువ కట్టే కాయితం ముక్క
పదవుల విపణిలో మాత్రం పనికిరాని తొక్క
పెట్టె అడుగున చివికి చివికి
చిల్లులు పడే భౌతిక పదార్థం.

చలికాలంలో మొదలు పెట్టి
చొక్కా మీద చొక్కా
ఇంకో చొక్కా మరో చొక్కా వేసుకుంటూ పోయి
వేసవి కాలం వచ్చినా చొక్కా విప్పడం
మర్చిపోయిన నాకు
అలల మీదా కలల మీదా
మొగ్గల మీద పసిబుగ్గల మీదా
మనసు.

ఈ ముసుగులన్నీ విసిరిపారేసి
చనిపోయిన తల్లి గర్భంలోకి వెళ్ళిపోయి
ఒదిగి పడుకుందామనే ఊహ.
కాయితం ముక్కల్నుంచి పారిపోయి
అక్షరరాక్షసుల చెరనుంచి తప్పించుకుని
రంగూ హంగూ లేని
మానవతా తీరాలకు ఈదుకుంటూ
వెళ్ళిపోదామనే ఆశ.

డిగ్రీలను మరిపింప జేసే
అచ్చమైన మంచితనం జల్లులో
తడవాలని తపన.

(1-3-1988 న స్నాతకోత్సవంలో డి.లిట్. డిగ్రీ తీసుకున్నప్పుడు మనసు గీచిన పిచ్చి గీతలు)

## విజయసారథి

### రథి-సారథి

నీ ప్రేమనుంచి పిండుకున్న
కవిత్వంతో బ్రతుకుతున్న ప్రాణిని నేను
నీ పారాణి పాదాలు
నా భాషకు
అడుగులు నేర్పుతున్నాయి
నీ పూల పెదవులనుంచి
ఎగిరి వచ్చిన సీతాకోక చిలుకలు
నా కాగితాలపై వాలి
అక్షరాల పరాగాల్ని విదిలిస్తున్నాయి
నీ తేనె కళ్లనుంచి కారుతున్న
సుధారసానంద బిందువులు
నా ఎద వాకిటిని శుభ్ర పరుస్తున్నాయి
మధురమైన నీ గానాలు
నా గుండె గోడలకు
రంగుల పాటలు అద్దుతున్నాయి
నీ చేతి వేళ్ళ స్పర్శకి
నా శరీరంపై దీపాలు వెలుగుతున్నాయి
నీ అల్లరి ముంగురులలో
చిక్కుకున్న పాలపిట్ట నా మనసు
నీ చిరునవ్వుల పువ్వులనుంచి
పిల్లన గ్రోవుల్ని ఏరుకుంటున్న
నా హస్తాలకు సమస్తం నీవే—
ఇలాగే ఎంత కాలం రాస్తావు రథీ!
కావాలి కవీ నీ కలంగళం
చైతన్య కవితకు సారథి!

# గాలి నాసరరెడ్డి

## అజంతా గురించి

ఆ ప్రతిమాట దగ్గరా
అంచు విరిగి హఠాత్తుగా లోయలో పడిపోతాం
లోయలో తిరుగుతున్న గండభేరుండాలు
మనల్ని రెక్కలమీద కూచో బెట్టుకుని ఎగురుతాయి
బహుశా
ఆయన మాట్లాడిందాని కంటె
మనల్ని ప్రేమించిందే ఎక్కువ
రోడ్ల మీద నడకల చెట్లు కూలినప్పుడు
ఆయన విలపించిందే ఎక్కువ
శిలా తరంగాల మధ్య ఎలాగూ నిద్ర లేదు
శూన్యం కూడా ఊరుకోదు
బాణాల్ని సంధిస్తూనే వుంటుంది
ఆయన క్షతగాత్రుడై సంచరిస్తూనే వున్నాడు
ఎక్కువగా ఆయన మాట నిశ్శబ్దమే
నిశ్శబ్దంలో కూడా అగ్ని జ్వలించడం కనిపిస్తుంది
ఆయన ప్రభువుల్నీ, అశ్లీల పదాల్నీ ఒక్కటిగా నిషేధిస్తాడు
ఆయన మనుష్యుల్నీ, కవిత్వాల్నీ ఒక్కటిగా ఉపాసిస్తాడు
ఆయన్ని మనం 'కవీ' అని పిలుస్తాం
సముద్రాన్ని సముద్రమన్నందుకు పొంగి పోతాం!

** ** **

"జిహ్వపని వాదించుట కాదు
ఆస్వాదించుట" —పఠాభి

# అనుముల కృష్ణమూర్తి

## రసభూమి

ఇది పురిటిల్లు పొందిపటికే
తడవయ్యె శిశూదయమ్ము; న
వ్వెద రెవరేని నా ప్రసవ
వేళకు అంగడియయ్యె నన్న
నవ్వెద రెవరైన తల్లిపొర
విచ్చు ముహూర్తమునందు
పెద్దలె రొద నొనరించిరన్న,
నగరో! మన తల్లులు
నక్కసెల్లెలున్.

నా తపస్సంత ధన్యధన్యంబు నేడు
వాక్కు తెలుపంగ లేని, భావమున కంది
యందని సుధారసానుభూతిఁ దలర్చి
తెటుల దీర్తునా నేటి నీ ఋణము తల్లి.

నా కనుంగవ నిండ అనాది నుండి
అవిరళానంద దుఃఖ బాష్పంబుధార
నేటి వరకును సాగి ఎండినది సుమ్మి
నేనిపుడు వట్టి బీడును నెగుల లేను.

సంప్రదింపులు సలిపె నక్షత్ర వర్గ
మెంత వెన్నెల భువికి పంపింత మంచు
అడవి యందెడారి సముద్రమందు మనకు
కాయ వలసిన పనిలేదు; కాస్త చాలు.

# పోచిరాజు శేషగిరిరావు

## ప్రభాకరార్చన

1. ఒక మధురక్షణమ్ము గురుతున్నది జీవన సంధ్యలో సము
త్సుకత గురూత్తముండు సుమసుందర హస్తమునన్ స్పృశించి యం
గకముల దివ్యదీప్తుల ప్రకంపితు జేసిన వేళ కాంతివ
ల్లిక యెద నాటె తన్మధుర లీల మనమ్మును బాయకుండగన్.

2. ద్రాక్షా పాకమునన్ రచింపగల 'సత్తా' లేదు నా లేఖినిన్
దీక్షా కంకణమున్ ధరింపగల 'శక్తి' లేదు నా చేతికిన్
రక్షాబంధనమున్నొసంగగల 'నేర్పా' లేదు నా బుద్ధికిన్
సాక్షాత్కారము చేసి చూపగల 'ప్రజ్ఞా' లేదు నా దృష్టికిన్
శిక్షాకాలమునన్ గురూత్తముని సంసేవించి కైకొన్న యా
చక్షుర్గోచరమైన రూపమునె ప్రస్తావించి యశ్రాంతమున్
అక్షయ్యంబగు భక్తితో, హృదయ కల్హారంబు నర్పింతు నా
యక్షీణ ప్రతిభా వికాసమున కాహ్లాదింతు లోలోపలన్.

3. ధ్యానమె యోగమై-పరమ తత్త్వము నించెడు బ్రహ్మతేజమై-
మౌనమె మేలి వ్యాఖ్యయయి-మంజుల వాక్కొక కాంతిగోళమై
ప్రాణము నార్తసేవకయి పంచిన సత్యదయా పయోనిధిన్
ప్రాణము ప్రాణమైన గురుపాదుల నే శరణంబు జొచ్చితిన్.

4. జీవితమే పురాశిథిల శిల్పమురీతి కృశించి జీర్ణమై
భావము శూన్యమై పరిభవమ్ముల కాకరమై చెలంగ, దీ
పావళి కాంతుల నవప్రభలొల్కగ జేసి నూత్న భా
వావళి నూల్కొనంగ రసబంధుర భవ్య పరీమళమ్ముతో
జీవము వోసి తీర్చి నను చేతనముం బొనరించి గౌరవ
శ్రీ విలసిల్ల జేయు రససిద్ధుని మద్గురు నెంతు భక్తిమై.

5. పాలిత శిష్యవత్సలు డపార కృపా రసవృష్టి ధారచే
నేలును విశ్వమెల్ల, విజితేంద్రియు డెవ్వడు, సర్వకాల సం
చాలకమైన భావములు చారుతరమ్ముగ నూటలూర్చు, యో
గాలయమైన వాడు హృదయాంతరవర్తి గురు న్నుతించెదన్.

6. పాయని ప్రేమధార-నిరవద్యముగా నడయాడు కాంతి-వి
శ్వాయత రక్షణమ్ము-సరస ప్రసరోదిత ధర్మగంగ-స్వే
చ్ఛాయుత జీవనమ్ము-గుణ చంద్రికలన్ వెలలించు యోగి-భ
ద్రాయిత మూర్తి-మానవత రూపము దాల్చిన మద్గురూత్తముల్.

7. తేనియ తేటవంటి నునుతీయని పల్కులు-బ్రహ్మ తేజమే
పూనిన మానవాకృతి-ప్రఫుల్ల మనస్కుడు సంతతమ్ము-తే
జో నిధులన్ వెలార్చి నెఱచూఱ లొసంగు 'ప్రభాకరార్య' వి
ద్యానిధికిన్ నమస్సుమ శతమ్ములు యోగ వికాస వర్తికిన్.

8. నడచెడు రాజహంస- రసనా మధురాంచిత భవ్యవాక్కు-నె
వ్వడు తన ప్రాణశక్తులు ప్రవర్తిల జేసెను నార్త సేవకై-
విడువడు సీ.వి వీ. పద పవిత్రలసత్ స్మరణమ్ము-ధ్యాన గ
మ్యుడు-నవ కల్పకమ్మునయి పొల్చు ప్రభాకరుకై శతాంజలుల్.

9. దేశి కూర్పులలోని తేనె లూటలు వార
నిగ్గుజగ్గులు నేర్పె నిధియతండు
మహిత గైర్వాణీ విమర్శనాత్మక కావ్య
పఠనమ్ము నేర్పిన పండితుండు
వాడివాడిగ నాంధ్ర వాఙ్మయ ప్రాచీన
కావ్యలోకము చూపు క్రాంతదర్శి
నిశితమ్ములౌ కూర్పు నేర్పు తీర్పులతోడ
పలుకు విన్నాణమ్ము పట్టు దిట్ట
చతుర కవితావధాన ప్రసారమూర్తి
ఆంధ్ర జాతీయతాముద్ర అచ్చముగను
తెలుగు మఱుగుల వెలిదీసి తెల్పినాడు
బాసలోపల నాతడగ్రేసరుండు.

(వేటూరి ప్రభాకరశాస్త్రి (1888-1950)గారి శతజయంతి సందర్భంగా)

# రసరాజు

## అల్లూరి సీతారామరాజు

1. భారత వీరనారి ముఖ పద్మముపై ఎవరా మనీషి సిం
దూరము దిద్దుచుండెను?.... తెనుంగు ధరిత్రికనుంగు బిడ్డ "అ
ల్లూరి" కిశోరమా? ప్రణతులో సమరాంగణ సార్వభౌమ! మా
హారతులంది కొమ్ము! శుభమస్తు! స్వరాజ్య మహాభిషేకముల్!

2. నీరము ముట్టలేదు–మరి నిద్రకు నోచుకొనంగ లేదు–తం
డ్రీ! రవి యస్తమించని బ్రిటీషు ప్రభుత్వము దద్దరిల్లె-నీ
పేరు వచింపఁగా; తెలుఁగు వీరులలో తలమానికంబు నీ
కీరితి–విశ్వలేఖిని లిఖించెను లెమ్ము భవత్ప్రతాపముల్!

3. నీ గడియారమందు రవి నిద్దుర చెందిన జాడలేదు–మి
న్నాగువలెన్ చరించితి వనారతమున్-దొరలెల్ల పన్ను ప
న్నాగములన్ గ్రహించితివి! నాయక లక్షణమన్న నీదెరా!
భాగము లేదు నీ యశము ప్రక్కన వేరొక వ్యక్తి కెన్నడున్!

4. "ఇమ్మహి పంచభూతముల కెల్లరు నర్హులు–దానిలోన భే
దమ్ములు, రంగు రంగు పరదాలనుగాని కనుంగొనంగ మృ
గ్య మ్మెవడబ్బ సొమ్ము–పరమాత్ముఁడొసంగిన సృష్టిలోన భా
గ్యమ్మును దోచుకొంట" కని గాండివ మెత్తిన వీరుఁడీవహో!

5. కకవికలయ్యె నీ "మిరపకాయటపా"కు బ్రిటీషు సింహ పీ
ఠిక–పదివేల సొమ్ము ప్రకటించెను నిన్గొని పట్టి తెచ్చు వా
రికి–గతిలేక; పప్పుడుక లేదపుడైనను–సాధ్యమౌనె శూ
లికి నెదురేగి నిల్చుట?–ఫలింపవు కాపురుష ప్రయత్నముల్!

6. ఏలికలై–సహింపని యకృత్యములం బొనరించి–మాన భం
గాలొనరించినన్ జననికాయము నీ వివరంబు సుంతయే
లీల వచింప లేదు! భళిరే! అది యెంతటి స్వామి భక్తి! ఏ
మూలకు వచ్చు మ్లేచ్ఛులు ప్రభుత్వము నీ బుజాశక్తి ముంగిటన్!

7. భీతిలి యొంత కాలిమిక స్వేచ్ఛకు దూరముగా వసించి-అ
జ్ఞాత తమస్సులో దినదినమ్ము గతించుట? మొక్కవోని వి
ఖ్యాతిని జాతి పాడుకొనఁగా నొకసారి గతించి విప్లవ
జ్యోతిగ నిల్చి సుస్థిరత నొందితి వీ వవిరా చరిత్రముల్!

8. ఇరువది యేడు వర్షములకే తల వాల్చితివా మహాత్మ! భా
స్కరు డొఁక కేతుకంఠమున శాప వశమ్మున గ్రుంకినట్లు; పం
జరమును వీడి-నేడు-మన జాతి విహంగము గొంతువిప్పి నీ
చరితము పాడుచున్నదిదె! స్వర్గములో చెవియొగ్గి వింటివా?

9. తెల్ల దొరలకు పక్కలో బల్లెమగుచు
తేజరిల్లిన "సీతారామరాజు" వీవు!
కనులు మిరుమిట్లు గొల్పు జీవనము చేసి
మించు తీవగ తనువు చాలించి నావు!

10. చీకటి తలదన్నెడి యా
వేకువ వలె దూకి నావు—విజయశ్రీ బం
ధూకమ్ములు నీ వెలుగున
రేకులు విప్పుచును తేజరిల్లె మహాత్మా!

(డా. తంగిరాల వారి ప్రేరణతో మైసూరు "ధ్వన్యాలోక"లో వ్రాసినవి)

"అవును, ఉగాది వచ్చు సమయంబున వెచ్చని వేపపూల, మా
ధవుడరుదెంచినాడు; బహుధా పరిరమ్య వసంత శాంత సాం
ద్ర్యవికచ మల్లికా మధురహాస విలాస వికాస భావ సం
భవ రస నవ్య భవ్యగరిమానత నూతన వర్షరాజుగా"

—దాశరథి

స్పానిష్ కవిత

## పాబ్లో నెరూద

(దక్షిణ అమెరికాకు చెందిన ప్రసిద్ధ కవి. 1904లో చిలీలో జననం. పద హారో ఏట మొదటి కవితాసంకలనం ప్రచురణ. 1971లో నోబెల్ సాహిత్య బహుమతి)

### లేత సంగీతం

అసహ్యాన్ని
ముసుగేసిన స్తనంలా స్పృశిస్తాను
ఎక్కడో నిద్రిస్తూ
దుస్తుల్ని మారుస్తూనే వుంటాను—

నేను లేను
నేను నిర్వీర్యుడ్ని
నాకంతా అపరిచితులే
నా గుండెల్లో
సముద్రాల, అడవుల ఆయుధాల్లేవు
నా నివాసం ఈ గృహం కానే కాదు—
రాత్రిని నింపుకున్న నీటిపాత్ర నా గొంతు
నా లోపాల చిట్టాలు రాసే బానిస ఆ చంద్రుడు—
ఓ నీటి కిరణం
ఓ ఇనుప అగాధం
నాదంటూ ఒకరోజు నా ఆస్తులు
అన్నీ అలల ఖజానా ఖైదీలు—
దుస్తులు రక్షణ కవచాలు విరిగిన అలలు
ఏమీ లేవు
జడిపించే కనురెప్పలూ లేవు—
అర్ధాంతరంగా జీవిస్తూ
అపుడపుడూ అనుసరిస్తాను
అప్రయత్నంగా స్పృశించిన ముఖం

నన్నే హత్య చేస్తుంది
కాలం నా ప్రియురాలు కానేకాదు—
నెత్తుటి వల పన్ని
ఉరితాడు సిద్ధం చేసి
నా కొరకు ఎదురు చూడకు
పేరూ వివరాలు విచారించకు
నా అస్పష్ట అనంతంలో నన్నొదిలేయ్
నా గాయాలతో నేనాడుకుంటూనే ఉంటాను
నన్ను పిలవకు—అది నా వృత్తి.

(ఇంగ్లీషునుంచి తెనిగింపు—ప్రసేన్)

"ప్రేమ అన్నది సంతోషం కలిగించే వస్తువు. ప్రేమ చెడిపోతే,
ముసుకులో గుద్దులాట అయితే, దాన్ని నేను ద్వేషిస్తాను....
మన ఆడపిల్లలకు ఎప్పుడూ పాపభీతిని బోధిస్తాం
ప్రతి మధ్య తరగతి పరుపుమీదా ఆడది
శిలువ ఎక్కుతుంది. నేను కేరళ ఆడదాని
అనాగరికపు, దౌర్జన్య జీవితంవైపు బాణాలు
విసిరేస్తాను. ధర్మ పారిశుద్ధ్యం ముక్కు పిండుతాను.
ఆడది మగవాడి తొడల మధ్యనుంచి మాత్రమే
అతని హృదయం చేరుకో గలదు"

—కమలాదాస్

## జింజి మాండెలా

### మనకోసం మరణించినవారు

లాగే సంకెళ్ళ
బరువుకు విరిగినట్లయిన మెడ
వంచి సద్దులేక దూరంగా, కాలం శరీరంలో
నిలబడి వున్నారు మనకోసం మరణించిన వారు;

వాళ్ళకు నవ్వన్నదే లేదు.

గడ్డకట్టిన రక్తపాతపు
మంచు పంజరంలోకి
జారుతూ........జారుతూ
పాతిపెట్టిన స్వాతంత్ర్య దేహంలోంచి
పొడి పొడి అయిన కపాలం
పూడిపోయిన గొంతుకతో
అరుస్తోంది;
విడుదల తెండి
విడుదల తెండి నాకు.
బాధతో నిండిన ఈ గొంతుకనే
ప్రతిధ్వనిస్తోంది జనం మనస్సు
భూతంవైపు మెడతిప్పిన వాళ్ళకు
చావు తప్ప మరేమీ కనిపించదు;

ఆదరించే మాటలు ఏవీ ఇప్పుడు?

కన్నీటి చప్పుళ్ళెందుకు
శవం మీది తప్పొప్పుల ఎరుకను
బాదుతూ........బాదుతూ
పాతిపెట్టిన స్వాతంత్ర్య దేహంలోంచి
పొడి పొడి అయిన కపాలం

పూడిపోయిన గొంతుకతో
అరుస్తోంది;

విడుదల తెండి
విడుదల తెండి నాకు.

మావైపు రేపు నడిచి వచ్చింది
అని అరుస్తోంది జనం మనస్సు
మనకోసం మరణించి దూరంగా కాలం
శరీరంలోకి కనుమరుగైన వారి
ముఖంలో వెలుగుల ఆసరా లేదు
వాళ్ళు మనవైపు చూస్తారు.;
సద్దేలేని మన చెవుల్లోకి
వాళ్ళు నిట్టూర్పులు విడుస్తారు
పాతిపెట్టిన స్వాతంత్ర్య దేహంలోంచి
పొడి పొడి అయిన కపాలం
పూడిపోయిన గొంతుకతో
అరుస్తోంది;
విడుదల తెండి
విడుదల తెండి నాకు.

ఓ దక్షిణాఫ్రికా, ఈ జనం గోడు నీకు వినిపిస్తుందా?

(నెల్సన్ మాండెలా కూతురు జింజి మాండెలా రాసిన 'ఎఖో ఆఫ్ మాండెలా' అనే కవితకు శ్రీ గంగాధర మూర్తి చేసిన కన్నడ అనువాదంనుంచి తెనిగింపు సి. సుశీల)

హిందీ కవిత

# ఏకనాథ్ శ్రీవాత్సవ్

## నది

(నూనాగు మీసాల నూత్న యౌవనంలో వుండే యీ కవి నేటి యువతరం ప్రతినిధి. ఈ తరం కవిత ఆశాజనకంగా ఉందీ అనడానికి ఈ నవయువకుడే సాక్షి. ఇటీవల దక్షిణ-మధ్య వలయ సాంస్కృతిక కేంద్రం మైసూరులో ఏర్పాటు చేసిన చతుర్భాషా కవి సమ్మేళనంలో చదివిన కవితలివి)

నేటికీ ఆ మధుర జలాలు
నా జ్ఞాపకాలలో భద్రంగా ఉన్నాయి.
దాని అందం, రంగు, సువాసన
నాకింకా జ్ఞాపకం ఉన్నాయి, అది
నీలమణిలాగా మెరిసిపోయేదనీ
జ్ఞాపకం ఉంది.
గువ్వలు గూడు చేరుకునే వేళ యిది
అమృత ఫలం
మాగే వేళ యిది.
నది నా కోసం ఎదురు చూస్తూ ఉందేమో
దానిలో నేను విసిరిన
రాళ్ళు ఉండే ఉంటాయి
నీటిపై తేలుతూ నా చిన్నతనం నాటి పూలు,
ఒడ్డున మా నాన్నగారి తడిచొక్కా.
దాని నడకలో
మా అమ్మ గొంతు వినిపిస్తుంది.
మాయిల్లు అద్దంలాంటి నదిలో కదలాడుతుంటుంది.

## అమ్మ కళ్ళు

ఇక్కడ నిద్రపోతూ, దీర్ఘ నిద్రపోతూ
రెండు కళ్ళు.

అలాగే నిద్రపోయి పోయి—దినం
మళ్ళీ మెల్లగా వస్తుంది.
వచ్చిన తర్వాత
ఈ కళ్ళు మనవైపు చూస్తాయి
మన కాలానికి చెందిన
గట్టి బండల్ని కూడా పిండి చేస్తూ.
మనం బాగా, బాలా బాలా
అలసిపోయినప్పుడు,
ఒంటరిగా ఉన్నప్పుడు
ఈ కళ్ళు మన పైన
ప్రేమ సుగంధాన్ని వెదజల్లుతాయి
వెలుతురు కిటికీల్లాగా
ఈ కళ్ళు మన చీకట్లోకి
తెరుచుకుంటాయి.
ఈ భూమి మీద,
మనమింకా ఉన్నాం, ఈ కళ్ళ
కలల్లాగా.

(తెనిగింపు : ఆర్వీయస్. సుందరం)

* * *

"జట్కా గుఱ్ఱం కాలంమెళ్ళో
గంటలు రెండు మ్రోగినవి
చచ్చిన తల్లి శవం
మెళ్ళో గజ్జెల
పట్టెడతో
ఉల్లాసంగా ఆడుకునే
పసిపిల్లాడులా గాలి"

—నారాయణబాబు

# సచ్చిదానంద రావుతరాయ్

## నిద్ర

(ప్రసిద్ధ ఒడియా కవి. 1916 మే 13 న జననం. 'కవితా-1962' పుస్తకానికి 1963లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమానం లభించింది. 1986 వ సంవత్సరానికి భారతీయ జ్ఞానపీఠ బహుమానం లభించింది)

నేనేమో పడుకున్నాను
లేచి చూస్తే
మహాభారతం ముగిసింది
ఎవరెవరు ఎక్కడెక్కడికెళ్ళారో
తెలీదు.
మహాయోధులందరూ దొర్లిపోయారు
భూరిశ్రవుడూ చంపబడ్డాడు.
తల్లి కడుపులో భ్రూణమూ
కుశాబాణంతో మంటగలిసి పోయింది,
మళ్ళీ రక్తపు నది
వానలో కొట్టుకు పోయింది.

గడ్డి మొలిచింది
కురుక్షేత్ర మైదానంలో
అక్కడ ఇప్పుడు ఏషియాడ్ ఆటలాడుతున్నారు.

నేను పడుకున్నాను
తర్వాత ఏవేవో జరిగాయి.
మొగలాయీలు వచ్చారు, బుడతకీచులు వచ్చారు,
ఇంగ్లీషువాళ్ళు,
మంగళపాండె, తాంత్యా టోపె
అంతా ఎగిరిపోయారు దూదిపింజల్లాగా,
సైమన్ కమీషన్ వచ్చింది

వచ్చాయి ఎన్నో మిషన్లు
భరతఖండంనుంచి ఒక ఖండం వేరయింది
అయితే మనం స్వతంత్రులమయ్యాం.

మనం ఎంతమందిమి ఏమయ్యామో తెలీదు
అన్ని చోట్లా వినిపించింది
స్వాధీనం, స్వాధీనం, స్వాధీనులం
ఎంత స్వాధీనులమయ్యామంటే మనం
దాన్ని పట్టుకోలేక పోయాం.

పగిలిన కుండనుంచి నీళ్ళు కారుతున్నాయి.

(రాజేంద్ర ప్రసాద మిశ్ర, బి. వై. లలితాంబ చేసిన కన్నడానువాదంనుంచి)

## చంద్రావతికి

విశాలమైన నీలి పందిరికింద
ఆపుకోలేని హృదయంలో
భావనల స్పందనం.

కిటికీ ఊచలకవతల ఆకాశం
చనిపోతున్న సూర్యుడు
కదలాడే ఆకులకు రంగు పూసే
అనంత నీలిమ
ముంగిలి గోడలమధ్య చిక్కుకుంది.

నీవు ఇచ్చింది, నాకు సంపద
నాకు దక్కనిది, మరొకడి స్వప్నం
నీ మీద నాకు ప్రేమ
అదే పదివేలు;
జీవనాన్వేషణ సార్థకం.

ఉతికి గంజి పెట్టిన తలపాగాలాగా
చంద్రుడి కాపలా
ఇంత అందమైన వెన్నెల
మనిద్దరికోసమే అని
ఎవరన్నారు?

నిద్రిస్తున్న బైనానగరం నల్ల రస్తామీద
శవశకటం జారుతోంది
దగ్గర్లోనే దారిపక్క బండ పక్క
ఖాళీ కొట్లో
సైనికుడొకడు
వేడి వేడి టీ చప్పరిస్తున్నాడు
మసకబారిన కళ్ళతో
పచ్చటోపీ అంచుమీదినుంచి
టీలో మొహం చూసుకుంటున్నాడు
చెదురుమదురు దీపాలు
నిశ్శబ్దంగా మరుగయ్యాయి.

పావురాయి గూటికి చేరుకుంది;
ఎక్కడున్నావు ప్రియా?
అనంత నీలిమను ఎదిరిస్తున్నావా?
పంజరంలో ఉన్నావా?

* * *

"చీకటి పడనీ ఓ కవితా! పిండేస్తాను నిన్ను—
కాయితం తన దాహం తీర్చుకోనీ"
—బోరిస్ పాస్తర్‌నాక్

# జోసెఫ్ బ్రాడ్స్కి

## నాస్తికుడు

(ఈ సారి నోబెల్ బహుమతి పొందిన రష్యన్ కవి. లెనిన్ గ్రాడ్‌లో 1940 మే 20 న జననం, అమెరికాలో ప్రవాసం. 'ఆధునిక ఐరోపా కవులు' అనే గ్రంథమాల ద్వారా పెంగ్విన్ సంస్థ ఈయన కవితల్ని ప్రచురించింది)

దేవుణ్ణి ఆడిపోసుకునే వాళ్ళు
ఎన్నయినా చెప్పనివ్వండి—
పల్లెటూళ్ళలో దేవుడు మాత్రం
మూలస్థానంలోనే ఉండడు.
నిజానికి అన్నిచోట్లా ఉంటాడు.
ఇంటి కప్పునూ మిట్టపల్లాల్నీ పావనం చేస్తాడు
రెండు తలుపుల మధ్యా నక్కి ఉంటాడు
పల్లెటూళ్ళలో దేవుడు ఎన్నో పనులు చేస్తాడు
శనివారం ఇనుపకుండలో గింజలు ఉడకేస్తాడు
రెపరెపలాడే మంటల్లో బద్ధకంగా గంతులేస్తాడు
వీటన్నిటికీ కళ్ళప్పగించిన నావైపు కనుసైగ చేస్తాడు
కంచెలు వేస్తాడు, కన్యాదానం చేస్తాడు
(వరుడు అరణ్యాధికారి), వినోదంకోసం బాతుకు
గురిపెట్టిన వాడు కొట్టడానికే
వీలుకాకుండా చేసేస్తాడు, తమాషాక్కు.

శరత్కాలంలో ఈల వేస్తూ వచ్చే పొగమంచు మధ్య
ఇదంతా తెలుసుకుని వీక్షించే అవకాశం కలగడం
ఒక్కటే పల్లెటూరి నాస్తికుడి పాలిటి
ఆనంద స్పర్శ అంటాను నేను.

కన్నడ కవిత

## రామచంద్ర శర్మ

### పాతకాలపు చైనా కథ

భలే భలే—చక్రవర్తి రాగం తీశాడు
తలెత్తలేదు కళాకారుడు.

ఏడు సంవత్సరాల నిరంతర ధ్యానం
గీచిన కుడ్య చిత్రం.
ప్రకృతి ధాతువులో అద్ది కుంచె సృష్టించిన
ప్రపంచం-అడవి నది మంచుకప్పిన పర్వతం.

నల్ల మబ్బుల చీరకు జలతారు అంచు
కుట్టిన చంద్రబింబం.
చందమామ కాదు, అది బంతి, కానే కావాలని
రాణి చంకలోని చిన్నవెధవ చేసిన రచ్చ.

భేష్ భేష్-జైకొట్టింది జనపదం
చిరునవ్వు చిందించ లేదు కళాకారుడు.

కొలను నీటిలో తమ ప్రతిబింబం చూచి
కిలకిల నవ్విన నక్షత్ర రాశి.
చెట్లకి చెట్లే మునిగి కడిగిన ఫలాలు సమర్పిస్తూ
చాలమంది నిల్చున్నారా చేతులు చాచి.

వినిపించింది కడలి ఇసుకలో ఒళ్ళు
వాల్చి పడుకున్నవాళ్ళ ప్రేమలొలికే పలుకు.
కళ్ళు తెరిస్తే సాక్షుల్లాగా మూగ
ప్రేక్షకులు-ఆడదాని బుగ్గను మరింత ఎరుపెక్కిస్తూ

ఇంద్రజాలమిది-ప్రభువు ఘోషించాడు
మాట్లాడలేదు కళాకారుడు.

అక్కడొక కొండ, కొండ అడుగున సగం
మూసిన కొయ్య తలుపు
పరిపూర్ణ కళకు అందని నిగూఢం
చేతులూపి పిలుస్తోందా?

ఆ వైపు ఏముంది, ఏముంది? ప్రభువు అడిగాడు.
తలుపువైపు తిరిగాడు కళాకారుడు.

చక్రవర్తి కనుసైగ చేయగానే
తలుపు తెరిచి మాయమయ్యాడు.
అరగడియ అగి ప్రభువు వెంబడించేంతలో
గాలి కొట్టినట్లె మూసుకుందా తలుపు.

## ఎ. కె. రామానుజన్

### కొందరి పునర్జన్మ

కొందరు మాత్రం
చచ్చినా బతికినా
మనవడికి తాత పేరు పెట్టినా
వడుగు పెళ్ళి కాన్పు కొడుక్కు
కూతురికి 21 రోజులు టైఫాయిడ్ వగైరా అయినప్పుడు
పాము కుబుసం వదిలి కుబుసంలో దూరి ద్విజ
మనిపించు కున్నప్పుడు
పునర్జన్మ
అంటారు.
గీత ఇదేముంది మహా!
రూంనుంచి రూముకు వెళ్ళినట్లు
పొద్దున్నే లేచి

చీర మార్చుకున్నట్లు
అంటుంది.

గుడ్డు

పురుగై గొంగళి పురుగు పడుకుని సీతాకోక చిలుకై
లేస్తే జీవశాస్త్రంలో దాన్ని
జీవ పరివర్తన అనో మరేదో
పేరో చెప్తారు

చైనా వాళ్ళయితే

ఓపికుంటే చాలు, మల్బరీ ఆకులు పట్టు అవుతాయి అంటారు.
నిజం.

అయితే మా పిల్లి పిల్ల
కారు కింద పడి పేగులు బయటికి వచ్చి
రక్తమాంసాలకు తోక పిల్లి తల మాత్రం
అంటుకొని అప్పచ్చి అయ్యే సరికి
రూంనుంచి రూముకు

కాలు కాలినట్లు తిరిగాను. ఒక రూంలో దాని
నల్లతెల్ల తోక కన్పించింది. వెనుక వదలిన
నీళ్ళయింట్లో దాని మ్యావ్ వినిపించింది.
భార్య బాధ పోగొట్టుకోడానికి స్నానం చేసి
చీర మార్చుకుంది,

కొడుక్కూ కూతురికీ బయట
ఎండలో పసుపుకంటే పసుపుగా ఎగిరే సీతాకోక చిలుకను
చూపించింది.

అయినా పునర్జన్మ
అనిపించలేదు, గీతలో కొటేషన్ కూడా
జ్ఞాపకం రాలేదు.

## ఆ పక్షి కావాలవి

మంగోలియాలో ఒక రాజు
ఉండే వాడట కదా
అతను ఏదో
దూర దేశం మీద దండెత్తినప్పుడు
అక్కడొక కొత్త పక్షి పాట విని
ఆ పాట నాకు కావాలి అని
పాటకోసం పక్షిని పట్టుకుని
పక్షితో బాటు గూడెత్తి
గూటికింద రెమ్మలు
రెమ్మలతో కొమ్మలు
కొమ్మలతో చెట్టు
చెట్టుకింది వేళ్ళు
వేళ్ళచుట్టూ మట్టి బెడ్డలు
ఆ ఊరు
నీరు
పంట
ఆ ప్రదేశం
దేశం
మొత్తం రాజ్యం
అన్నీ లాగేసుకోవాలని
అనిపించి
మిగిలి తగిలి వున్న ఏనుగులు గుర్రాలు రథాలు
సైన్యం అంతా చేర్చుకుని
రాజ్యమంతట్నీ గెలిచి
తన సామ్రాజ్యానికి చేర్చుకుని

ఇంటికే వెళ్ళలేదు.

# హెచ్. ఎస్. వెంకటేశమూర్తి

## నేను నిన్ను ప్రేమిస్తాను

నేను నిన్ను ప్రేమిస్తాను.
గులాబి గగనం బుగ్గ ఎరుపెక్కుతుంది

నేను నిన్ను ప్రేమిస్తాను.
సూర్యబింబం అంబరందిగివచ్చి మంచునీటి మణిలో మెరుస్తుంది.

నేను నిన్ను ప్రేమిస్తాను.
బ్రహ్మాండం మీద గగన పక్షి వెచ్చగా రెక్క కప్పుతుంది

నేను నిన్ను ప్రేమిస్తాను.
పడమట అస్తమించిన అదే సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు.

## సూర్యుడు-గడియారం

(పసిపిల్లలకోసం రాసిన కవిత)

పెద్ద ఇల్లు; కొంగ్రొత్తగా విరాజిల్లు. అందులో ఒక
మంచం; చిన్నది కొంచెం దాని పక్కన ఒక
మేజా; పైన ఒక రోజా. పక్కనే దీపం;
చెడిపోయింది పాపం. గోడకొక్క క్లాకు;
కీ ఇవ్వాలంటే చికాకు? నిలిచి పోయిందైదుకు;
సూర్యుడు సంజ మునిగేటందుకు—కావాలి కదా ఆరు!
కీ యిచ్చేదెవరు?

(తెనిగింపు : ఆర్వీయస్. సుందరం)

## అచ్చమైన మానవత్వపు కలలు వి. ఆర్. విద్యార్థి 'అలలు'

వి. ఆర్. విద్యార్థి (వేలూరి రాములు) చేయి తిరిగిన కవి. సైనికుడుగా భారత దేశమంతా తిరిగి వచ్చిన ప్రజా భావుకుడు. క్రమ శిక్షణతో పాటు మానవత్వంతో ద్రవించే గుండె కలిగిన ఉత్తమ కవి. ప్రపంచ శాంతి కోసం ఆరాట పడే బుద్ధిజీవి. తన అశాంతిని పదునుగా మాటల్లోకి దట్టించి పేల్చ గల నేర్పరి.

'అలలు' అనే ఈ కవితా సంపుటిలో 37 కవితలున్నాయి. 'అపరిచితులు' మొదటి కవిత, 'తపన' చివరి కవిత. ఈ రెండు కవితల మధ్యా "తన సమాజాన్ని, తనని తాను, తనకి అందకుండా అనంతంలో దాగిన అపరిచితాన్ని అక్షరాల్లో ఆవిష్కరించుకున్నాడు." ఈ సంపుటిలో అపరిచితుల, జ్ఞాపకాల తోట, తుపాకి శాంతి, విమాన విలాపం, నిన్న-నేడు, వెల్లి, బహురూపి, పగిలిన గుండెలు రగులుతున్నాయి, ఇది కథ కాదు, సైనికుడి ఉత్తరం, జీవన సాఫల్యం, మేఘాలయాలో, ప్రణయకపోతం, తపన అనే కవితలు ఏ కోణం నుంచి చూచినా ఉత్తమ కవితలు. కట్టుకున్న పెళ్ళాన్ని కూడా సరిగా అర్థం చేసుకోకుండా షోకేసులో బొమ్మలా చేసి బ్రతికి వేస్తున్న పురుష దురహంకారం, కాలంతో చెరగని ప్రేమానుబంధం, ప్రపంచమంతటా ఎగురుతున్న 'మారణాయుధాల హిరోషిమా భయంకర జ్ఞాపకాల' రాబందులూ, సమాజంలో కాలగతిలో పాటు ఏ విధంగానూ మారని పేదల బ్రతుకులు, పనిపిల్ల అమాయకమైన నవ్వు, ఒక ప్రక్క శాంతిని కోరుతూనే ఇంకో ప్రక్క యుద్ధాలు చేసే మానవ జాతి ద్వంద్వ వైఖరి, దివి తాలూకా ఉప్పెననుంచి కాపిటల్ చేసుకుంటున్న పొలిటికల్ పార్టీలు, దేశంకోసం ప్రాణాలర్పించిన సైనికుని భార్య పొట్ట గడవక పిల్లల్ని బ్రతికించుకొనడానికై చేసే వ్యభిచారవృత్తి, బంగ్లాదేశ్ యుద్ధరంగంలోంచి సైనికుడు పెళ్లానికి వ్రాసిన దీపావళి పండుగ ఉత్తరం, ప్రకృతి సౌందర్యం, తాజమహల్ ప్రేమగాథ, స్వగ్రామంలోని అమాయక జీవులు—ఇత్యాదిగా వివిధ రూపాలను చిత్రించింది విద్యార్థి కలం. రకరకాల భావాలతో తలో ప్రక్కా పోతున్న జనాన్ని అందర్నీ తన వెంట వేసికొని చీకటి గుహలు దాటి తేజోమండలంలోకి చొరబడాలని ఈ కవివరేణ్యుని తపన. తిలక్ తర్వాత యుద్ధ జీవితాన్ని ఇంత సూక్ష్మంగా వర్ణించిన

కవి లేడు అంటే అతిశయోక్తి కాదు (తిలక్ కవితలు ఊహలోంచి పుడితే ఈ కవి కవితలు స్వానుభవంలోంచి పుట్టాయి).

ఈ కవితా సంకలనాన్ని "ఏనాడూ ఎవడికీ తలవంచని వాడూ, నిరంతరం సామాన్యుని బాగుకోసం తపించేవాడూ" అయిన కాళోజీ నారాయణ రావుగారికి అంకితం వెయ్యడం ఎంతైనా సమంజసంగా ఉంది.

"అన్యాయాన్నెదిరిస్తే
నా గొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే
నా గొడవకు ముక్తి ప్రాప్తి" అంటూ కాళోజీ ఈ 'అలలు' స్వీకరించడం ఈ కావ్యం గొప్పతనాన్ని చాటుతోంది. ఆంధ్రదేశంలోని ప్రతి యువకవీ ఈ విద్యార్థి రసవత్తరమైన కవిత్వపుటలలలో ఓలలాడాలని కోరుకుంటున్నాను.

(అలలు, రూ. 8-00, మాధురీ పబ్లికేషన్స్, 1-1-691/2/ఎ, గాంధీనగర్, హైదరాబాద్-500 380)

—టెలివిజన్ రావ్

'కృత్యాద్యవస్థ' పేరుతో కాంతి కరపత్రం పంచిపెడ్తున్న సౌభాగ్య

'సంధ్యా బీభత్సం'తో కవిగా బొమ్మకు వచ్చిన సౌభాగ్య ప్రచురించిన మరో కవితా సంపుటి 'కృత్యాద్యవస్థ'. గుండెలకు భాష్యం చెప్పగల నేర్పుతో మంచి కవిగా నిలదొక్కుకున్నారు సౌభాగ్య. 'ఒక్కసారి, ఒకసారి అలా వీధుల్లోకి రండి' అని, 'బయటికొచ్చే తీరిక లేకుంటే కిటికీలోంచి సాచిన కిరణ హస్తంతోనైనా కరస్పర్శ చెయ్యండి' అంటారు 'కాంతి కరపత్రం' అనే కవితలో.

'ఒక్కో ఫలితం వెనక లెక్క లేనన్ని బాధలు, ఒక్కో మార్పు వెనక తరలి పోయిన తరాల శ్రమ' అంటున్న 'కృత్యాద్యవస్థ' కవితా సంపుటి శీర్షికా కవిత.'ప్రయత్నం' మామూలుగానే ఉంది. 'యుద్ధమింకా ఆరంభం కాలేదు'లో వాక్యాలు :

ఆఫీసుల్లో అధికార్లకు అభివాదం చేసినప్పుడే
అభిమానం రక్తకణాల్లో రగుల్తుంది

— బాగున్నాయి. ఆంధ్రదేశంలో పండుతున్న నవలల పిచ్చికాపుమీద ఎత్తిన ధ్వజం 'సెన్సేషనల్ నాన్సెన్స్'. కవిత ఉపన్యాసమై చివరికి మంచి వాక్యంతో ముగిసింది: 'ఆంధ్రదేశంలో కూడా రాజకీయాల తర్వాత లాభసాటి వ్యాపారం నవలలే". 'రేపటి ఎడారికి రూపుదిద్దుకుంటున్న' అనంతపురాన్ని గురించిన కవిత ఒకటి. "పగబట్టిన వాడికి ప్రపంచం అందంగా వుండదు" అని పగను గూర్చిన కవిత ఒకటి. "అణుబాంబుల అండాలలోంచీ తెల్లని రెక్కలతో చల్లని నవ్వుల్తో శాంతి దూతలు ఉల్లాసంగా లేస్తారు" అని అమాయకంగా 'కాలజ్ఞానం' చెప్తున్న సౌభాగ్య కలం కొత్త కొత్త అనుభవాలను నింపుకొని తెలుగు కవితకు కొంగ్రొత్త అందాలను సంతరిస్తుందని ఆశించవచ్చు.

(కృత్యాద్యవస్థ, రూ. 8-00, సౌభాగ్య, సిస్టమ్స్ ఆడిట్ డిపార్ట్‌మెంట్, హె ఎ ఎల్, బాలానగర్, హైదరాబాద్-42)

## యస్. యస్. రెడ్డి 'ప్రవాహం'

అక్కడక్కడా తళుక్కుమని మెరిసే కవిత్వపు బుడగలతో యస్. యస్. రెడ్డిగారి 'ప్రవాహం'. ఇటీవలి కాలంలో అందంగా, ఆకర్షణీయంగా వస్తున్న కవితా సంకలనాల మధ్య నిరాడంబరంగా ప్రవాహం. రెడ్డిగారికి భావన ఉంది, భాష ఉంది, పరుగులెత్తే లేఖిని ఉంది 'ఉల్లాస పుప్పొడి కోసం' అని ప్రారంభమయ్యే మొదటి కవితలో మొదటి పాదం, 'నగర మధ్యగా నిల్చిన' వంటి వాక్యాలు మధ్య మధ్యన అన్నంలో రాళ్ళలాగా కలుక్కుమంటుంటాయి. అయినా 'డబుల్ డెక్కునుండి తిలకిస్తే ప్రకృతి పయ్యెదలా భాసిస్తుంది', 'సమానత, మాట మడతల్లో పేపర్ల గూట్లో మేకప్ వేసుకుంటోంది' వంటి వాక్యాలు చదువరులను అలరిస్తాయి. 'ప్రవాహం' ఎక్కువ భాగం కవిత్వాన్ని గురించిన కవితలే

('ప్రవాహం', రూ. 6-00, ఎస్. ఎస్ రెడ్డి, 1-1-244 చిక్కడపల్లి, హైదరాబాద్-20)

—సుబ్బు

## మరికొన్ని కవితా సంకలనాలు

1. శేషేంద్ర చమత్కారికలు, చైతన్య కవితా వేదిక, ఆర్-2, జ్ఞానభారతి, బెంగుళూరు-56, రూ. 5-00.
2. నాకు జ్ఞాపకం ఉంది, డా. మాదిరాజు రంగారావు, రసధుని ప్రచురణలు, క్వార్టర్స్ నం. 14, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్-9, రూ. 5-00.
3. పెన్గన్, ప్రగతి కవుల కవితా సంకలనం, ఫ్రీవర్స్ ఫ్రంట్, ఎంసి-15, మలక్ పేట కాలనీ, హైదరాబాదు-36, రూ. 5-00.
4. ఫ్రీ, కొల్లూరి, ఎక్స్‌రే పబ్లిషర్స్, కొల్లూరి హౌస్, అమలాపురం-533 202, రూ. 6-00
5. రాజకీయ భాగోతం, ఆసు రాజేంద్ర, మావిరాజువారి వీధి, అమలాపురం, 5 3 202, రూ. 5-00
6. జలఖడ్గం, విజయసారథి, ప్రతులకు డి. సుదర్శన్, 20/15, గటీర్‌పరా, మాలంచారోడ్, ఖర్గపూర్-721 301, రూ. 2-00.
7. అద్దం, మాధవీ సనారా, స్టూడెంట్స్ బుక్ సెంటర్, గేట్ బజార్, ఖర్గపూర్-721 301. రూ. 2-00.
8. మువ్వల చేతికర్ర, శిఖామణి, బుక్ సెంటర్, మెయిన్ రోడ్, విశాఖపట్నం-1, రూ. 15-00
9. భూమి స్వప్నం, నందిని సిధారెడ్డి, 1-6-35, ఫతేనగర్, మెదక్, 522 110, రూ. 7-00.
10. శతాంకుర, ఆచార్య సుప్రసన్న, తెలుగు శాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్-9. రూ. 12-00

## ఇటీవలి కొన్ని సాహిత్య పత్రికలు

1. వినుకు, సి-28, శ్రీనివాసనగర్, గుంటూరు-522 006, సంవత్సర చందా రూ. 10-00.
2. రచన, మాసపత్రిక, 26-9-2., రామాలయం వీధి, కంబాల పేట, రాజమండ్రి, సంవత్సర చందా రూ. 30-00.
3. జముకు, శ్రీకాకుళ సాహితి, 7-14-4/10, మేడమీద, న్యూ కాలనీ, శ్రీ కాకుళం-532 001.
4. నవోదయం, నేతాజీ గురుకుల విద్యాలయం, ఖానాపురం-506 132, సంవత్సర చందా రూ. 12-00.

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : ఆచార్య తంగిరాల సుబ్బారావు

కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : శ్రీ పి. యు. బి. శర్మ

పోషకులు (1987-88)

18. శ్రీమతి సుందరి, డా. ప్రసాదరాయ కులపతి దంపతులు, గుంటూరు
19. శ్రీమతి నాగలక్ష్మి, శ్రీ తంగిరాల వెంకట సుబ్బావధానులు దంపతులు, బెంగుళూరు
20. శ్రీమతి ప్రభ, శ్రీ వై. చిత్తరంజనరావు దంపతులు, బెంగుళూరు

జీవిత సభ్యులు (1987-88)

శ్రీయుతులు

59. ఆర్. నరసింహన్, హొసూరు
60. డా. కె. శ్రీలక్ష్మి, హైదరాబాదు
61. ఆచార్య పి. ఆదేశ్వరరావు, విశాఖపట్టణం
62. గాదిరాజు సూర్యనారాయణరాజు, మత్స్యపురి (ప. గో. జిల్లా)
63. డా. కె. సుమతి, హైదరాబాదు
64. వి. కనకదుర్గ, మద్రాసు
65 ఎం. నాగప్ప, బెంగుళూరు
66. ఎం. అండమ్మ, హైదరాబాదు
67. ఆచార్య ఎం. శంకరరావు, బెంగుళూరు
68. పి. కృష్ణారెడ్డి, పోలవరం
69. భళ్ళమూడి రాధాకృష్ణమూర్తి (తండ్రిగారైన కీ. శే. భ. శ్రీరామ మూర్తిగారి, పేరిట), పెదవాడ పల్లి (ప. గో. జిల్లా)
70. బి. వి. నత్యనారాయణ మూర్తి, రాజమండ్రి
71. జి. పాపయ్య, యాడయ నెల్లూరు (తమిళనాడు)
72. జి. విజయసారథి, మైసూరు
73. యస్. శ్రీనివాసన్, భీమసంద్రం (తమిళనాడు)
74. కుమారి టి. యస్. జ్యోతి, హొసూరు ( " )

75. కె వెంకటముని రెడ్డి, డెంకణికోట ( " )
76. కె. రామమూర్తి. హోసూరు ( " )
77. జి. చంద్రశేఖర్, " ( " )
78. సి. శ్రీనివాసులు " ( " )
79. విట్టూరి సత్యనారాయణ, తణుకు
80. లకంసాని శ్రీరామకృష్ణ, తణుకు
81. ఎస్. శ్రీనివాస్, జవళగిరి (తమిళనాడు)

ప్రత్యేక సభ్యులు (1987-88)

31. డా. సి. ఆనందారామం. హైదరాబాదు
32 టి. ఎస్. సుందరమూర్తి, బొంబాయి
33. డా. కసిరెడ్డి వెంకటరెడ్డి హైదరాబాదు
34. డా ఎల్లూరి శివారెడ్డి. హైదరాబాదు
35. దీవి సుబ్బారావు, హైదరాబాదు
36. పోతుకూచి సాంబశివరావు. సికింద్రాబాదు
37. ఇ. ఆర్. కె శాస్త్రి. వారణాసి
38. ఆచార్య వి. కుటుంబరావు. వారణాసి
39. డా. కె యస్ శాంత. వారణాసి
40. డా. కె. అన్నపూర్ణ. బెంగుళూరు
41. డా. ఆర్. చంద్రశేఖరరెడ్డి, అనంతపురం
42. గుడి సుబ్రహ్మణ్యం రెడ్డి. కృష్ణాపట్నం(నెల్లూరు జిల్లా)
43. జలంధర చంద్రమోహన్, మద్రాసు
44. కె. వి. రమణారెడ్డి, కావలి
45. ఆచార్య కె. సుప్రసన్నాచార్య. వరంగల్లు
46. ఎ. వెంకటరమణ ప్రసాద్, కాళసముద్రం (కదిరి)
47. స్వర్ణసుధాకర్. చిన్న చింతకుంట (మహబూబ్ నగర్ జిల్లా)
48. బులుసు వెంకటేశ్వర్లు. లంకలపాలెం (విజయనగరం జిల్లా)
49. బి టి. వి. వి. పేర్రాజు, రాజమండ్రి
50. పి. రాఘవరావు, రాజమండ్రి
51. కె. కోటేశ్వరరావు, కొవ్వూరు
52. బి. కోటేశ్వరరావు, పోలవరం
53. కె. కోటేశ్వరరావు, రాజమండ్రి
54. భళ్లమూడి శ్రీరామమూర్తి (తండ్రిగారైన కీ. శే. భళ్లమూడి భీమ శంకరంగారి జ్ఞాపకార్థం), విజయవాడ

